తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 6

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)





ప్రచురణ

అన్నమాచార్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

ప్రథమ ముద్రణ : 1947
ద్వితీయ ముద్రణ : 1998









ప్రతులు : 2,000

వెల : రు. 12-00

ప్రచురణ :
డా॥ I. V. సుబ్బారావు, I.A.S.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

ఇందరికి అభయంబు లిచ్చు చేయి
కందువగు మంచిబంగారు చేయి ॥

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమత: తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A ,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి ప్రపత్తి, దేహాత్మేశ విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు, జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు అన్నమయ్య గ్రాంధిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహిత్య సదస్సులు నిర్వహిస్తున్నది తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుమన్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె ఆర్ వినాయక్ I A S. గారికి కృతజ్ఞతాంజలి

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M A ,Ph D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

తేది 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయబడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.



# శృంగార సంకీర్తనలు

## ఉపోద్ఘాతము

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కమిటీవారు శ్రీ తాళ్ళపాక వారి రచనలను 1935 సంవత్సరమున ముద్రింప నారంభించిరి. అంతకుఁ బూర్వమే శ్రీమహంతు ప్రయాగదాస్‌జీవారు తమపరిపాలన కాలమునఁ దిరుపతికొండపై సురక్షితములుగా నున్న తాళ్ళపాక రచనల రాగిరేకులను కాగితములపై వ్రాయించి యుంచిరి. వానినిబట్టి తర్వాత కమిటీ వారు మూడు సంపుటములను బ్రకటించిరి. రాగిరేకులలోఁ గానరాకున్నను తాళ్ళపాకవారి రచనలేయగు 'అష్టమహిషీ కల్యాణము', 'పరమయోగివిలాసము' 'ఉషాపరిణయము' అను గ్రంధములను గూడ కమిటీవారు ముద్రించిరేకాని యవి యింకను ప్రకటన పడయలేదు ఆనాఁడు దేవస్థానమువారు కొంతవఱకుఁ బ్రకటించి విడిచిపెట్టిన తాళ్ళపాక సంకీర్తనల నాల్గవ సంపుటమును బూరించుటకు నీ పరిశోధనాలయాధ్యక్షులు తలపెట్టి యాపనిని నాకప్పగించిరి. నేను ప్రయత్నముతో దేవస్థానము ఆఫీసునుండి రాగిరేకులన్నింటిని నీపరిశోధనాలయమునకు తెప్పించుకొని సహోద్యోగుల సహాయముతో రాగిరేకులను, ముద్రిత గ్రంధములను బరిశీలింపఁగా నీ క్రింది విషయములు తెలియవచ్చినవి.

### 1వ సంపుటము - తాళ్ళపాక లఘుకృతులు

వీని రాగిరేకులు కొన్ని మాత్రమే యగపడినవి.

### 2వ సంపుటము - అధ్యాత్మ సంకీర్తనలు

రాగిరేకులలో తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల రేకులు 391, పెదతిరుమలాచార్యులవి 77, చినతిరుమలాచార్యులవి 10, వెరసి 478. అందు అన్నమాచార్యులవి 30, పెదతిరుమలాచార్యులవి 39 రేకుల సంకీర్తనములు మాత్రమే ప్రకటితములయినవి. ఆ ప్రకటనము కూడ కలగపులగముగా, అపక్రమముగా, నివి యన్నమాచార్యుల రచనములు, ఇవి పెదతిరుమలాచార్యుల రచనములు అని వేర్పాటు లేక యున్నది. ఉపక్రమమున మాత్రమన్నియు నన్నమాచార్యుల రచనములే యగునట్టున్నది.

అన్నమాచార్యుల యధ్యాత్మ సంకీర్తనల మొదటి రేకు తరువాత 1 నుండి 10 దాక పెదతిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనముల రేకులు, మరల 11 నుండి 20 దాక అన్నమాచార్యుల రేకులు, 22 నుండి 29 దాక పెదతిరుమలాచార్యుల రేకులు, 31 నుండి 36 దాక అన్నమాచార్యుల రేకులు, 37 నుండి 50 దాక పెదతిరుమలాచార్యుల రేకులు, 61 నుండి 70 దాక అన్నమాచార్యుల రేకులు, 71 నుండి 77 దాక

పెదతిరుమలాచార్యుల రేకులు, 78 నుండి 80 దాక అన్నమాచార్యుల రేకులు ముద్రణమున కెక్కినవి.

ఇందింకను అన్నమాచార్యులవి 2 నుండి 10 దాఁకను, 21 నుండి 30 దాకను, 37 నుండి 50 దాకను, 81 నుండి 88 దాకను, 91 నుండి 391 దాకను; పెదతిరుమలాచార్యులవి 12 నుండి 21 దాకను, 31 నుండి 36 దాకను, 51 నుండి 70 దాకను; చిన్నతిరుమలాచార్యులవి 1 నుండి 10 దాకను ముద్రితములు కావలసియున్నవి.

ఈ అధ్యాత్మ సంకీర్తనములలో అన్నమాచార్యుల రేకులు 51 నుండి 60 దాకను, 71 నుండి 77 దాకను, 121 నుండి 130 దాకను, 216, వెరసి 28 రేకులు కానరాలేదు.

పెదతిరుమలాచార్యుల రేకులు 11, 30 సంఖ్యలవి కానరాలేదు.

## 3వ సంపుటము - శృంగార సంకీర్తనలు

రాగిరేకులలో తాళ్ళపాక అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల రేకులు రెండువేల రెండు. పెదతిరుమలాచార్యులవి నూఱు. చినతిరుమలాచార్యులవి పది. వెరసి 2112. అందు అన్నమాచార్యులవి 1 నుండి 18 దాకను, 20 నుండి 30 దాకను, 61 నుండి 95 దాకను; పెదతిరుమలాచార్యులవి 3 నుండి 7 దాకను, 11 నుండి 50 దాకను ముద్రితమయినవి. ఇందు పెదతిరుమలాచార్యులవి 3, 4, 5, 6 రేకులు పాడిన పాటలుగా రెండు తూర్లు ముద్రితమయినవి.

## అన్నమాచార్యుల శృంగార సంకీర్తనముల రేకులు

| రేకు నంబరు | రేకులలోని మొదటి పాటల మొదళ్ళు | అచ్చు పుటసంఖ్య |
|---|---|---|
| 1 | యేవూరికేవూరు యెక్కడికి | 2 |
| 2. | తగిలినమునులేయాతని | 5 |
| 3. | మగువవూర్పులనైన | 9 |
| 4. | శోభనమే శోభనమే | 13 |
| 5. | అప్పటి యెండ చెమట | 18 |
| 6. | ఆఫరాని వలపాయనమ్మా | 22 |
| 7. | తన్నుంబాశినేనింత | 26 |
| 8. | కోవిల పలుకదు కొమ్మావి | 30 |
| 9. | వద్దు నీకు నాతోడి వట్టిమాటలు | 34 |
| 10. | వోద్దేలమొక్కే వోవుద్దవుండా | 38 |
| 11. | మెచ్చితి భళిరా వోరి | 303 |
| 12. | చక్కందనముల చేత జవ్వన | 307 |
| 13. | కొమ్మదన ముత్యాలకొంగు | 311 |

**పెదతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనములు రేకులు**

ఇదింకను అన్నమాచార్యులవి 31 నుండి 60 దాకను, 96 నుండి 2002 దాకను; పెదతిరుమలాచార్యులవి 1, 2, 8 నుండి 10 దాకను, 51 నుండి 100 దాకను; చినతిరుమలాచార్యులవి 1 నుండి 10 దాకను ముద్రితములు గావలసి యున్నవి.

వీనిలో అన్నమాచార్యులవి 19, 96 నుండి 100 దాకను, 451 నుండి 460 దాకను, 521 నుండి 530 దాకను, 706, 889, 912, 915, 1105, 1151 నుండి 1160 దాకను, 1271 నుండి 1280 దాకను, 1521 నుండి 1531 దాకను, 1581 నుండి 1590 దాకను, 1911 నుండి 1920 దాకను వెరసి 81; పెదతి ుమలాచార్యులవి 51 నుండి 60 దాకను, వెరసి 91 తేకులు కానరాకున్నవి.

**పై తేకులన్నియు నీక్రిందికొలతలతో నున్నవి.**

అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు. పా. $15\frac{1}{2}$ అం. వె. 7 అం.
పెదతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు పా. 16 అం. వె. 7 అం
చినతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు పా. $15\frac{1}{2}$ అం. వె. 7.2 అం.
అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు పా. $15\frac{1}{2}$ అం. వె. 7 అం.
పెదతిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు పా. $15\frac{3}{4}$ అం. వె. $6\frac{3}{4}$ అం.
చినతిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు పా. 15 అం. వె. $7\frac{1}{2}$ అం.

ఇవిగాక 33 అంగుళముల పొడవు $2\frac{1}{2}$ అం. వెడల్పు గల తేకులు 120, తునకలు 5 ఉన్నవి. అవి మీద వర్ణితములయిన తేకులను చిక్కన తక్కువ పొడవు, హెచ్చు వెడల్పు గలవానిని జెక్కించుటకు ముందు అన్నమాచార్యుల శృంగార సంకీర్తనములు కొన్ని మాత్రము చెక్కిన తేకులుగాఁ గాన వచ్చుచున్నవి. వీనిలోని గేయములే పెక్కులు, మీఁద వర్ణితములయిన అన్నమాచార్యుల శృంగార సంకీర్తనపు తేకులలోనున్నవి. కొన్నిపాటలు చెక్కించిన పిదప తేకుల ధైర్ఘ్యము, పలుచన వాని చిరస్థితికి భంజక మగునని వెఱచి, వానినే మరల క్రొత్త తీరు తేకుల కెక్కించి యుందు రనుకొనవచ్చునేమో!

అహోబలమరమునఁ దాళ్ళపాకరచనములు కలతేకులు కొన్ని యున్నవట! వానిని గూడఁ దెప్పింప యత్నించుచున్నాము. అవి వచ్చెనేని యిప్పుడు కానరాని తేకులో, మఱికొన్ని క్రొత్తరచనములో లభింపఁగల వనుకొందును.

1937 సంవత్సర ప్రాంతముననే శ్రీ దేవస్థానము కమిటీవారి నిర్దేశముననే అన్నమాచార్యుల మిగిలిన శృంగార సంకీర్తనముల ముద్రణ మారంభమై ఆరు ఫారముల ముద్రణము సాగి నిలిచిపోయెను. తన్ముద్రాపకులు, అన్నమాచార్యుల తొలి తేకునన్న యుపక్రమ వాక్యముల మరల ముద్రించి, యముద్రితములుగానే యున్న యన్నమాచార్యుల 31 నుండి 41 దాక గల నుజ్జగించి 42వ తేకునుండి ముద్రణ మారంభించిరి.

మే మీ తేకులను, బుస్తకములను బరిశీలింపఁగా ముద్రణ మపక్రమముగా

సాగుచుండుట తెలియవచ్చెను విడనాడంబడిన 31 నుండి 41 దాక గల తేకుల గేయములను, నప్పటికి ముద్రితములయిన 42 నుండి 60 దాక గల తేకుల సంకీర్తనములకు దర్వాత చేర్చి ముద్రించితిమి

**ఈ సంపుటములో ముద్రితములైన అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల తేకులు**

పూర్వ మెప్పుడో వ్రాయించియుంచిన కాగితములు, వాని లిపిరీతులు నేఁటి ముద్రణమున కుపయోగపడఁదగినట్లు లేవుగాన ఇంక ముద్రింపవలసిన గ్రంధభాగములను రాగితేకులను దగ్గఱనుంచుకొని చూచుచు నాఁటి లిపిరీతిని, నేఁటి పరనార్థ లిపిరీతికి ననుగుణముగా మరల వ్రాసి ప్రకటింప వలసియున్నది. ఇందుకై డైరెక్టరుగారగు శ్రీపరవస్తు వేంకటరామానుజ స్వామి యం.ఏ. గారు ఈ వాల్యుము నింతటితో ముగించి పై విషయమెల్ల నుపోద్ఘాతముగా నిందు వెల్లడించుట యుక్తమనుటచే నట్లు చేసితిని.

లభించిన తాళ్ళపాక వారి రచనముల తేకులు రెండువేల యాఱువందల ముప్పదియైదింటిని, పరిశోధించి, చిక్కులు దీర్చి, విషయ విభాగము, కవి విభాగము, ముద్రితా ముద్రిత విభాగము మొదలగు వివిధ విభాగముల నెల్ల సమకూర్చుటలో శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన కార్యాలయమున తెలుగు పరిశోధక విద్యార్థిగా నున్న చిరంజీవి విద్వాన్ ఎ.వి. శ్రీనివాసాచార్యులు ప్రధానముగా పరిశ్రమించి స్పష్టమయిన యెఱుకను నాకు జేకూర్చెను.

ఇఁకపై నాధ్యాత్మ సంకీర్తనముల శేషమును శృంగార సంకీర్తనముల శేషమును, క్రమముగా వాల్యుములుగాఁ బ్రకటింపఁగలము.

తాళ్ళపాకవారి పదములలోని యపూర్వ శబ్దార్థ సంపదలను, రచనా విశేషములను, నాఁనాటి లిపిసంప్రదాయములను వెలువడనున్న వాల్యుములలో వివరింతుము.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా
పరిశోధనాలయము, తిరుపతి

**వేటూరి ప్రభాకరశాస్త్రి**

**గమనిక :** రసజ్ఞ పరిశోధక పాఠకుల సౌకర్యార్థమై శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి పీఠిక యథాతథముగా పొందుపఱచితిమి.

శుభమస్తు

## శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల

# శృంగార సంకీర్తనలు



స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక పరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యు లవతరించిన పదాఱు యేండ్లకు తిరువేంగళనాధుండు ప్రత్యక్షమైతేను అదిమొదలుగాను శాలివాహనశకపరుషంబులు ౧౪౨౪ అగునేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౨ నిరుధానకు (నిరోధానకు? తిరోధానానకు?) తిరువేంగళనాధునిమీద నంకితముగా తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనలు.

**రేకు-౪౨** **ఆహిరి**

**పల్లవి**

చిన్ని శిశువూ చిన్ని శిశువూ
యెన్నఁడుం జూడ మమ్మ యిటువంటి శిశువూ

**చరణములు**

తోయపుంగురులతోడఁ దూ గేటి శిరసు, చింత
కాయలవంటి జడలగములతోడ
మ్రోయుచున్న కనకంపు మువ్వల పాదాలతోడ
పాయక యశోదవెంటఁ బాఱాడు శిశువూ.
ముద్దుల వ్రేళ్లతోడ మొరవంక యుంగరాల
నిద్దపుంజేతుల పైఁడి బొద్దులతోడ



అర్ధపుంజెక్కులతోడ నప్పు లప్పు లనినంత
గద్దించి యశోదమేనుఁ కౌఁగిలించు శిశువూ
బలుపైన పొట్టమీఁది పాలచాఱలతోడ
నులివేఁడి వెన్న దిన్న నోరితోడ
చెలఁగి నేఁ డిదె వచ్చి శ్రీవేంకటాద్రిపై
నిలిచి లోకములెల్ల నిలిపిన శిశువూ. ॥ ౧ ॥

## భైరవి

### పల్లవి

ప్రాయంపు మదములే పరిణామము మతిఁ
బాయని రమణికి నీపై నెంతవలపో.

### చరణములు

తమ్మిపూవుఁగొలనిలో తరుణులుం దాము మింద
తుమ్మెద లీఁదులాడంగ దొంగి చూచి
కొమ్మ నినుఁ గూడి కేళాకూళితోఁ గస్తూరినీట
నిమ్మైల నోలలాడిన దెటువంటి వలపో.
కొదమమావిపై గండుఁగోవిల లేఁజిగురాకు
ముదిత కందీఁగాఁ ప్రేమమునఁదాఁజూచి
అదివో యుప్పరిగెపై నాకుమడిచి నీ వీఁగా
వదనాన నందుకొనె వడి నెంత వలపో.
నెయ్యంపుఁ జకోరము వెన్నెల రస మింతినోర
నొయ్యనె కుమ్మరించంగ నువిదచూచి
కయ్యంపుంగూటమిని వేంకటేశుండ తమ్మరస
మియ్యంగఁ జొక్కితివి నీ విపుడెంతవలపో? ॥ ౨ ॥

## ముఖారి

### పల్లవి

రమణి నేర్పు నేరములాయె
జమళివిధుల సరసపు విభుఁడా.

### చరణములు

తెలవకు నంపిన తెల్లని కలువలు
మఱపున కెందామర లాయె
నెఱుఁగము నీవిపు డింతచేతువని
కఱతలకలికివి గా విభుఁడా.

మగువకు నంపిన మకరంద మిచ్చుటి
జిగి దొలంకేటి చిఱుచేఁదాయె
అగు నీ యెకసక్యమ్ములమాటల
వగ నెఱజాణండవా విభుఁడా.

చెంతల ముత్యపుం జిప్పల తోయము
లంతలోనె ముత్యములాయె
సంతతకరుణా జలనిధి లక్ష్మి
కాంతుఁడవఁట వేంకటవిభుఁడా. ॥ 3 ॥

## కాంభోజి

### పల్లవి

ఆరగింపవో మాయప్ప యివే
పేరిన నేతులు పెరుగులును

### చరణములు

తేనెలు జున్నులు తెంకాయ పాలును
ఆనవాలు వెన్నట్లును

నూనె బూరెలును నురుగులు వడలును
పానకములు బహుఫలములును.
పరమాన్నంబులు పంచదారలును
అరిసెలు గారెలు నవుగులును
కరజికాయలును ఖండమండెఁగలు
పరిపరివిధముల భక్ష్యములు.
కడుమధురంబగు కమ్మఁబూరణపుఁ
గుడుములు నిడ్డెన కుడుములును
సుడిగొనునప్పాలు సుకినప్పాలును
పొడి బెల్లముతోఁ బొరఁటుచును.
కాయపు రుచులకు గనియగు మిరియపుఁ
గాయలు నేలకి కాయలును
పాయరానియంబాళపుఁగాయలు
నాయతమగు దధ్యన్నములు.
ఒడికపుఁగూరలు నొలుపుఁ బప్పులును
అడియాలపు రాజాన్నములు
బడిబడిఁ గనకపుఁ బళ్లెరములతోఁ
గడువేడుక వేంకటరమణా. ॥ ४ ॥

## సామంతం

### పల్లవి

అల్లవాఁడెవో అతివరో కడు
పెల్లైన ముత్యాల పేరులవాఁడు.

### చరణములు

తెప్పమీద నున్న వాఁడు తెల్లని కన్నులవాఁడు
దుప్పటి కుంకుమనీటఁ దొప్పందోఁగినాడు.

పుప్పొడి మేనెల్లనిండఁ బూవులవేట్లాడి
కప్పురగందులనెల్లం గరఁగించినాఁడు.
క్రుమ్మిడిజారినవాఁడు కోమలి చిమ్మనం గ్రోవి
చిమ్మెడి పన్నీట మోము చెమరించువాఁడు
కమ్మని కస్తూరిబొట్టు కరఁగిచెదర కను
దమ్ముల నలుపు చూపు దైవాఱువాఁడు.
మంచిమంచిమణులు దాపించిన గద్దియమీఁద
అంచగమనలుం దాను నాట చూచువాఁడు
మించిన కోనేటివాఁడు మెరసి వైభవముల
నెంచంగల తిరువేంకటేశుండనువాఁడు. ॥ ౭ ॥

## శంకరాభరణం

### పల్లవి

ఒక్కలాగువాఁడవా యోరి యిట్టి
తక్కులం బెట్టితి నన్నుఁ దగిలించి నీవు.

### చరణములు

తెలిసితిమిలే తెప్ప తిరుణాళ్లనాఁటి
జలములు నామీఁదఁ జల్లుతానే
సొలపుం జూపుల నిట్టె సొంపుగఁ జూచి చూచి
వలపుజల్లితివి యెవ్వతె పైనోరి.
కంటిమి నీలాగుఁగ్రక్కనఁ దిరువీధుల
నింటి ముంగిటను నీ వేఁగుతానే
వెంటనె యాలవట్టము విసరేటి [illegible]తిగుబ్బ
చంటిమీఁద నొరగి వేసాలఁ బోతివో.
ఇన్నియు మెచ్చితిరా నిన్నింతలోనె యిప్పుడు నీ

వున్న పైఁడియుయ్యాల నీ వూగుతానే
మన్నన కౌఁగిట నన్ను మరపించి యెక్కడికొ
కన్నులార్చితివి వేంకటరాయ యోరి ॥ ౬ ॥

**రేకు-౪౩** **శంకరాభరణం**

**పల్లవి**

అతను సంపదకంటె నసదా చెలిరూపు
మతిచింతచేత వేమరు నలఁగెఁ గాక

**చరణములు**

తగుఁ జందురుని నణఁచఁ దగదా చెలిమోము
వగలచే నొకయింత వాడెఁగాక
పగటుఁగోవెల మించి పాఱదా సతిపలుకు
జగడమునఁ బతిఁబాసి సన్నగిలెఁ గాక.
కదలు గంధపు గాలి గా(వ?) దా చెలియూర్పు
కదిమేటి మదనాగ్నిఁగ్రాఁగెఁ గాక
కొదమ తుమ్మెదగమికిఁ గొఱఁతా చెలితురుము
చెదరి మరుబాణముల చే జాఱెఁ గాక.
లీలఁబన్నీటికిని లేఁతా చెలిచెమట
లోలిఁబూఁబానుపున నుడికెఁగాక
యేలచిగురునకంటె నెరవా చెలిమోవి
గేలి వేంకటవిభుఁడు గీలించెఁగాక. ॥ ౭ ॥

**శ్రీరాగం**

**పల్లవి**

ఒప్పదువోయింత కొరపులం జూఁడేవు నా
నొప్పులెఱుంగవు యింత నొగిలించే వేలరా.

### చరణములు

తెల్లని కన్నుఁ గొన తీగె మెఱుపుల చూపు
చల్లకువే నాగుండె జల్లనీని
మెల్లని సొలపుల మెత్తనిమాటలకు నే
దల్లడించఁగానె యింతతాఁక నాడే వేలరా.
పూఁచిన యొఱపుల బొమ్మముడిజంకెనల
లోఁచకువే మనసు చిల్లులువోయీని
దాఁచిననీచిత్తపు బిత్తరపుటానలు నాపై
చాఁచి చాఁచి పలుమారు చంపంజూచేవేలరా
చిమ్ముల మురిపెపుఁ జిఱు నవ్వులనే నన్నుఁ
గ్రుమ్మకువే మనసెల్ల గొల్లంబోయీని
దిమ్మరిజాణఁడవోరి తిరువేంకటేశ నన్ను
క్రమ్మరఁ గ్రమ్మరఁ గూడి కాఁకరించేవేలరా. ॥ ౮ ॥

## శ్రీరాగం - ఏకతాళి

### పల్లవి

తొల్లిటివలెఁ గావు తుమ్మెదా యింక
నొల్లవుగా మమ్మునో తుమ్మెదా

### చరణములు

తోరంపు రచనల తుమ్మెదా కడుఁ
దూరేవుగొందులే తుమ్మెదా
దూరిన నెఱఁగవు తుమ్మెదా మమ్ము
నోరగఁజూడకువో వోతుమ్మెదా.
తొలుప్రాయపుమిండ తుమ్మెదా కడుఁ
దొలిచేవు చేఁగలే తుమ్మెదా

తొలుకరి మెఱుఁగవే తుమ్మెదా యింక
నులికేవు మముఁగని వో వోతుమ్మెదా
దొరవు వేంకటగిరి తుమ్మెదా మా
తురు మేల చెనకేవు తుమ్మెదా
దొరకె నీచనవులు తుమ్మెదా యింక
నొరు లెటిఁగిరి గదవో వోతుమ్మెదా. ॥ ౯ ।

## శ్రీరాగం

### పల్లవి

చాలు నింక నిటువంటి సంసారము మరుని
పాలైతి నిపు డింటి భాగ్యమిది నాకు.

### చరణములు

తనియ కిటు నీవు గాంతల నెల్లనాయెదుట
గొనియాడ దొరకొంటి కొంకులేక
వినియుఁ బ్రాణముతోడ విషమైన యీకూడు
దినఁజేరినది యేఁటిదేహమిది నాకు.
వెఱవ కిటు సతుల నీ వెనువెంటఁ బెట్టుకొని
మెఱయ దొరకొంటివిదె మేరలేక
యెఱిఁగియునుఁ దీపనుచు నిట్టి నీమన్ననల
చెఱఁబెట్టి నది యేఁటి జీవమిది నాకు.
ఎక్కువగు నీతరుణు లిందరిని నాకిట్ల
మ్రొక్కించదొరకొంటి మొఱఁగులేక
గ్రక్కునను నన్ను వేంకటగిరీశ్వర కలసి
చిక్కనైతివి చాలుఁ జిన్నమిది నాకు. ॥ ౧౦ ॥

## సామంతం

### పల్లవి

చెలిదా మతి నీచెఱగాక
తలఁపగ నీకిది తగులైపోయె.

### చరణములు

తరుణీమణివా తమ్మికన్ను లివి
అరయ నెపుడు నీయవె కాక
నిరతపుఁజూపులు నీచెలువమునకే
యిరవై వనితకు నెరవైపోయె.
మెలుఁతది గా దీమే నిటుకాఁకల
కలవఱచిన నీయదే కాక
పులకజొంపములఁ బ్రుంగు డగుచు నీ
యలుకల చెమటల కమ్ముడువోయె.
పంకజముఖివా బలుపుఁ గుచములు న
ఖాంకరుచుల నీయవే కాక
వేంకటేశ నీవేడుక కౌఁగిట
నంకురించె నీవవునోకావో. ॥ ౧౧ ॥

## ఆహిరి

### పల్లవి

సతికి నిటువంటి రాజస మేల కలిగెనే
తతిగొన్న విరహాగ్ని ధరియించ లేదు.

### చరణములు

తోరమగు భారంపు తురుమేల కలిగెనే
నారీమణికి మెఱుఁగు నళినముఖికి

వైరంపు మరుని నెవ్వగల బాణాగ్నిచే
జారఁగా పలుమారు సవరించ లేదు.
వెలఁదికి జఘనంపుఁ బ్రేఁగేల కలిగెనే
కలహంసగమనమునఁ గదల లేదు
నలికంపు నడుము సన్నమున నవకపు మణుల
మొలనూలు జారఁగా మోవనే లేదు.
ఇంతికిని చక్కఁదన మింతేల కలిగెనే
పంతఁ బొరలించు యౌవనమదమున
ఇంతలోననె వేంకటేశు కౌఁగిటఁగలసి
మంతనపుఁ బరవశము మతిఁ దెలియలేదు. ॥ ౧౨ ॥

రేకు-౪౪ బౌళి

పల్లవి

కనుమూసెఁగదె దీని గరువంపుఁ దెలివి
చనుదోయి పైకొంగు జారిన నెఱుఁగదు.

చరణములు

తలకెక్కెఁగదె దీని తనువికారములు
పొలుపైన నెరులు కొప్పున జారెను
చలి ముంచెఁగదె దీని జవ్వనపు మదము
పులకజొంపములచేఁ బొరలెక్కె మేను.
వడదాఁకెఁగదె దీని వాల్ గన్నుఁగొనలు
చిడుముడి ముచ్చటతో సిగ్గువడీని
బడిద ప్పెఁగదె దీని పలుకుఁదేనియలు
తడఁబాటుతోడ చిత్తము దాఁచెనిపుడు.
కసరెక్కెఁగదె దీని కస్తూరి చెమట
అసలుఁగుంకుమతోడ నలరీని మేన

ఉసురెక్కెఁగదె దీని యొరుపునూరుపుల
పొసఁగి వేంకటపతి పొందు దెలిపెడిని. ॥ ౧౩ ॥

## ఆహిరి

### పల్లవి

తొడరు నటువలెనే దొర కోపము
అడియాలమిటు సేసె నబ్బెఁగా బలిమి.

### చరణములు

తనుఁబాసినంతనే తరుణిఁ గడునేఁపెనని
వనజారిమీఁదఁ బ్రియవరుఁడు గూడి
కనలి కొనగోళ్లఁదునుకలుసేసి జవరాలి
చనుజక్కవలకొసగెఁ జాలదా బలిమి.
కలికి కోమలికి చిలుకలు గండుఁ గోవిలలు
పలుకులనె వేఁచెనని ప్రాణవిభుండు
కెలవుఁ బలుకుల సన్నగిలఁ జేసి యలబలము
తలిరుమోవినె యేఁచె దక్కెఁగా బలిమి.
మతినుండి చిత్తజుఁడు మగువ గారించెనని
పతి వేంకటేశ్వరుఁడు పడతిఁ గదిసి
ప్రతిలేని మనసెల్లఁబరవశము చేసి మరు
నతివ కన్నుల నించె నదియపో బలిమి. ॥ ౧౪ ॥

## ఆహిరి

పచ్చి కస్తురి నీకు బ్రాఁతిగాని
ఒచ్చెమని పూయ నొల్ల మి దెన్నఁడును.

### చరణములు

తట్టుపునుఁ గొడల నంతటా నలంది

దిట్టవై పరిమళానఁ దిరిగేవు
ఇట్టిది మాయడవిలో నింతా నిదే
ఒట్టి యుండు నే మొల్ల మి దెన్నఁడును.
కప్పురపుఁ దావితోడఁ గదియుచు
చిప్పిలెటి చెమటలఁ జెలంగేవు
తప్పక యింటింట దీని తరువులే నే
మెప్పుడు మాచేత నంట మిదెన్నఁడును.
జవ్వాది శిరసు నిండఁ జమరుకా యిట్టె
పవ్వళించే విదె నాపక్కనీవు
రవ్వయిన వేంకటరమణుఁడా మే
మెవ్వరమూ దీని నెఱుఁగ మెన్నఁడును. ॥ ౧౫

కాంబోది

పల్లవి

వలపుల దాడి వచ్చె వనితలారా మరుం
డెలగో లేయంగఁ జొచ్చె నేలాగే

చరణములు

తూరుపునం బొడిచెఁ జందురుఁడు మిన్నుల మోవ
పాఱుతెంచె విరహుల బందికాఁడు
గోరపు వెన్నెల వెల్లి గొని మీఁదమీఁద నిప్పు
లేత్రై పారఁగఁజొచ్చె నెందు చొత్తమే.
చందనపుఁ గొండ వంక చల్లగాలి తుదముట్టి
ముందు ముందె కదిసె దుమ్ములు లేవఁగా
మందమై పన్నీటి సోన మందు చల్లె నమ్ములై
యెందు చూచినఁ దానె యేమి సేతమె.
క్రొచ్చి పారె గుబ్బచన్నుఁ గొండల చెమ్మటనీరు

రొచ్చుగం గస్తూరి దరులు జారఁగా
పచ్చిగా వేంకటగిరిపతి యింతిఁ గూడఁగాను
ఇచ్చకాలె గనమాయె నింక నేఁటిదే. ॥ ౧౬ ॥

## సామంత

### పల్లవి

వలదన నొరులకు వసమటవే
తలఁచినట్ల నిది దైవమె చేసె.

### చరణములు

తరుణి కుచములను తామరమొగుడలు
విరిసేనోయని వెరపునను
సరగునఁ బతి నఖ చంద్రశకలములు
దరులఁ గలుగ నివి దైవమె చేసె.
పొలఁతి వదనమను పున్నమచంద్రుఁడు
బలిమి నెగయునని భయమునను
మెలఁత చికుర ధమ్మిల్లపు రాహువు
తలఁజెదరఁగ నిదిదైవమె నేసె.
వనితకు వాడునొ వలపు తాపమున
తనులతికయనుచుఁ దమకమున
ఘనవేంకటపతికౌఁగిట చెమటలఁ
దనివిదీర్చనిది దైవమె సేసె. ॥ ౧౭ ॥

## ఆహిరి

### పల్లవి

విన్నవించఁగరాదు విచ్చేయు మనరాదు
అన్ని విన్నపములు అవియె యివియు.

**చరణములు**

తూఁగు మంచముమీఁద తొయ్యలి పవ్వళించి
వ్రేఁగైన తురు మరవీడఁగాను
కాఁగిన మేనితో కన్నుఁ దమ్ముల నీ
రాఁగియాడిన మాట లవియె యివియు.

గొప్పలయిన చనుఁగొండలా పైపైనె
చిప్పిలు చెమ్మట చిందఁగాను
చెప్పక చెప్పుచు చెలి తడంబాటుతో
నప్పుడాడినమాట లవియె యివియు.

నీవి చెఱఁగు జారి నెలఁత నీ కౌఁగిట
కావికన్నులతోడఁ గరఁగుచును
శ్రీవేంకటేశ్వర చెలరేఁగి నివ్వెర
గై వెనుకఁదలంచె నవియె యివియు. ॥ ౧౮

**తేకు-౪౫** **ఆహిరి**

**పల్లవి**

సుదతి నీ కింతవంటా చూచెఁగాని
యెదనున్న నీతలం పెఱుఁగలేదాయె.

**చరణములు**

తగులనాడితి వంటా తమక మందితి వంటా
నగితివంటా నింతి నమ్మెఁ గాని
జగడించి వేఱొక్క సతికి మోహము సేసి
తెగి తన్ను విడిచేది తెలియలేదాయె.

కలలో వచ్చితివంటా కన్నుల మొక్కితివంటా
వెలఁది పువ్వుల బంతి వేసెఁ గాని

కలికి చేఁతల వట్టికాఁకలు వొడిమించి
తలవంపించేవని తలఁచలేదాయె.
వేరుసేయ వంటా వేంకటపతి వంటా
కూరిమి గలవంటాఁ గూడెఁ గాని
నేరుపు మెరయించి నెలఁత నీ వెంతేని
ఊరడించినదాఁక నుండలేదాయె. ॥ ౧౯ ॥

## ఆహిరి

## పల్లవి

ఇంతగా జేసెఁగా యింతి కన్నుల నగవు
సంతరించగరాని చనుదోయి బిగువు.

## చరణములు

తనివిమాలిన తలఁపు తడవోరువనిబులుపు
అనువెఱుంగని కెలపు అడియాసమెలపు
కనుఁగలువలో సొలపు కాఁకదీరని యలపు
వనితచిత్తములోని వడిగొన్న వలపు.
ఒడలెఱుంగని నెగులు నుల్లంబులోఁదగులు
వడియుఁగన్నీటిలో వగలు
పొడలువెట్టెడిపొగులు పొందువాసినదిగులు
పడఁతికి నిది యెల్ల బరికించఁబగలు.
వెరవెఱుంగని పురపు వింతలాగులయొరపు
మిరుమిట్లు గొనుమేనిమెరుపు
తిరువేంకటాచలాధీశ్వరుని కనుగిరుపు
తరుణి కిటువంటి మెత్తని పూవుఁబరపు. ॥ ౨౦ ॥

## సౌరాష్ట్రం

### పల్లవి

ఈడేరని యట్టి వలపేఁటికమ్మా
యీడుజోడుగాని వలపేఁటికమ్మా.

### చరణములు

తనువు తనువు గూడి తమకముమీఁదమీఁద
నినుమడించని వల పేఁటికమ్మా
మనసు మనసు తోడ మక్కళించి సందు లేక
యెనసివుండని వలపేఁటికమ్మా.
మచ్చికల చేఁతల మతిలోలురై తా
మిచ్చ యెఱుఁగని వలపేఁటికమ్మా
తచ్చునయలుకలతో ధన్యత ప్రేమల
యెచ్చుకున్న యట్టి వలపేఁటికమ్మా.
పంతముచెరిచివాఁడు పానుపుమీదికి వచ్చి
యింతసేయలేని వలపేఁటికమ్మా
కంతు నిఁకేలని శ్రీవేంకటపతి నన్ను గూడె
నింత పెచ్చులేని వలపేఁటికమ్మా. ॥ ౨౧ ।

## శుద్ధవసంతం

### పల్లవి

ఎంతమాయల వాఁడెంచి చూడఁగ వీఁడు
ఇంతి యీతనిరూప మెవ్వరెఱుఁగుదురు.

### చరణములు

తెలుపు జలములలోన తెప్పవలెఁదేలీనే
తలఁకి పాతాళమున దాఁగియుండీనే

కెలసి తనకన్నులను కెంపువగాఁ జేసీనే
నెలఁత భీకరముగా నేఁడు నవ్వీనే.
ఒరపుగా భూదాన మొకరిఁదా నడిగీనే
తరుణి భూమొక్కరికి ధారవోసీనే
మరలి పద్మజుని పనుమనినైనఁ జంపీనే
పరచుఁదనమున వృధా పాలుమాలీనే.
పలుమారు తన సిగ్గు బయటఁ బడవేసీనే
కలికితనమునఁ దాను గడవఁబాసీనే
వెలఁది వేంకటగిరివిభుఁడు నా కౌఁగిట
తొలఁగక చెమటలఁ దొప్పఁదోఁచీనే. ॥ ౨౨ ॥

## సౌరాష్ట్రం

### పల్లవి

ఎట్టు గడియించె నమ్మ యీవలపు
పుట్టించి నటువంటి పూఁటకాఁపుమరుండు.

### చరణములు

తడఁబాటు నాలికకు తలఁకు మానంబునకు
నొడఁబాటు మఱపులకు నుదుటుఁ దలఁపులకు
కడువేడుకలు కోరికలకు భయ మాసలకు
బెడిదంపుఁ గోపంబు బిత్తరి చూపులకు.
అతిముదము చింతకును అలపు గర్వంబునకు
మితిలేని తాపంబు మెత్తని తనువునకు
రతి గమ్మచెమటలకు రచన విరహంబునకు
ధృతి లేమి మనసునకు గతి గమనమునకు.
కురులు నెన్నుదుటికిని గుఱుతు లధరంబునకు

మురిపెంపుఁ జిఱునగవు ముద్దుమోమునకుఁ
దిరమైన వేడుకలు తిరువేంకటేశునకుఁ
బరిణాపు మాటలివి పడఁతు లిందఱికి. ॥ ౨౩ ॥

## ముఖారి

### పల్లవి

అహో సాధు తవాగమనం
బహుళవైభవై: ప్రతివచనై: కిమ్.

### చరణములు

తతోపసర మిధ్యాశఠవచనై
రితస్తవైర్మఽమ హితం కిమ్
బత మమ దేహో(త్ప్రాణ స్తథాపి
గత ఏవై తత్ కారణమిహ కిమ్.
సంవృతి చేలం జహి చపల త్వం
సంవాదేమే సతతం కిమ్
త్వం వా మమ చిత్తం సాంత్వయసి
కిం వా కురు మమ ఖేలనమిహ కిమ్.
అతి బిభేమి భవదాచరణాదిహ
చతుర వేంకటాచలరమణ
సతీం మా మనుసరసి కిమర్థఽం
రతిరాజవిభవ రచనమిదం కిమ్. ॥ ౨౪ ॥

రేకు-౪౬ **భూపాళం**

### పల్లవి

విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా.

### చరణములు

తెల్లవాఱె జామెక్కె దేవతలు మ[illegible]లు
అల్లనల్ల నంతనింత నదివో వారె
చల్లని తమ్మిరేకుల సారస్యపుఁ గన్నులు
మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా.
గరుడకిన్నరయక్ష కామినులు గములై
విరహపు గీతముల వింతతాళాల
పరిపరివిధములం బాడేరు రాగాల నిన్నదివో
సిరిమొగము దెరచి చిత్తగించవేలయ్యా.
పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజభవాదులు నీపాదాలు చేరి
అంకెల నున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుఁడా రెప్పలు విచ్చి చూచిలేవయ్యా ॥ ౨౫ ॥

### లలిత

### పల్లవి

ఎందరి వలపించెనో యంటనింట
చిందుల పాటలు వింట సిరులు చేకొంట.

### చరణములు

తుంగభద్ర యేటికాడ తోరమైనకొండనీడ
రంగుమీరి పైఁడి గోడ రాతిమేడ
అంగడి నున్నాఁడు చూడ నదివో పెడతల
చుంగుల పించెపు గూడ చుట్టుఁ బాగతోడ.
పండరంగినుండి వచ్చి పామరుల నెల్ల మెచ్చి
యెండలేని నీడలోన యెచ్చి యెచ్చి

వెండిఁ బైఁడిఁదడంబడ విభవాలఁబ్రొద్దు వుచ్చి
కొండనుచు వరములు కోరిక లిచ్చి.
చక్కని యావిట్టలుండై జవ్వనానఁ జెలువుండై
ప్రక్కనున్న సతితోడఁ బ్రబలుండై
మక్కువ వేంకటగిరి మాయధారి దేవుండై
యెక్కడా నెదురులేక యీడ నున్నాఁడిడివో. ॥ ౨౬ ॥

## సామంతం

### పల్లవి

తార వలచినయపుడె తరుణిరతుల
తారసము లెట్లుండు తగవు లెట్లుండు.

### చరణములు

తరితీపు లెట్లుండు తాలుము లెట్లుండు
గరువంబు లెట్లుండు కసరు లెట్లుండు
పొరపొచ్చె మెట్లుండు పొలయలుక లెట్లుండు
నెరవరిక లెట్లుండు నెఱుక లెట్లుండు.
ఓపికలు నెట్లుండు నోల్లములు నెట్లుండు
చూపోప మెట్లుండు సొలపు లెట్లుండు
దాఁపరము లెట్లుండు తగుమాన మెట్లుండు
కోపంబు లెట్లుండు కొఱఁత లెట్లుండు.
సిరిదొలఁకు లెట్లుండు శేషాద్రిపతికరుణ
కిరవైన సతిమనసు నెపుడు నెట్లుండు
మురిపమది యెట్లుండు ముద్దుఁజూపుఁగవమీఁద
నరచందురుని రేక లపుడెట్టులుండు. ॥ ౨౭ ।

## మెంచబౌళి

### పల్లవి

నీకు నేల తమకము నీకు అలపు నేఁడు
నీకు వాఁడు మోహించి నీలోనె యుండఁగా.

### చరణములు

తొడవుగాఁ గమ్మని కస్తురిఁ బట్టుగాఁబెట్టి
జెడలల్లి జవ్వాది శిరసుపై నంటి
విడువని విరహపు వెచ్చ మేన దైవాఱ
నిడువాలుఁ గనుదోయి నీరు నించ నేఁటికి.

కొత్త ముత్యపు సరుల కుచ్చులు వీపున వ్రేల
నొత్తిలి చెక్కునఁ గర మూఁది మోమువంచి
లత్తుక మోవి గదల లలన నీచిన్నయెలుఁ
గెత్తి ప్రేమ దైవాఱ నెవ్వరిఁ బాడెదవే.

కొండలరాయఁడు వాఁడు కోనేటితిమ్మఁడు నీ
నిండిన చిత్తములోన నీవు దానై యుండఁగాఁ
గొండగొన్న సుఖమెల్లఁ గొల్లలాడుదువుగాక
బొండుమల్లె పానుపుపైఁ బొరలఁగ నేఁటికే. ॥ ౨౮॥

## ముఖారి

### పల్లవి

నీకుఁ గాంతకుఁ దెలుసు నీవెఱుఁగు దది యెఱుఁగు
నీకడాకడవార లెవ్వ రెఱుఁగుదురు.

### చరణములు

తప్ప కిటు నినుఁ జూచి తరుణి చనుఁగవమీఁదఁ
గప్పిన చెఱఁగువదలఁ గప్పనేఁటికిరా

చెప్పఁ జాలక పొలిఁతి చెలికరముఁదనకరము
నప్పళించుచు గోర నదిమె నేఁటికిరా.
కాంత నీ చిరునవ్వు కనుఁగొనలఁ గని మనసు
వంత దెలుపక మొగము వంచ నేఁటికిరా
ఇంతి వేఱొకతె నిను నెలయించఁగాఁ జూచి
యంతలో నవలిమొగ మాయె నేఁటికిరా.
ఎలమిఁగైకొని వేంకటేశ! నీవాతరుణి
నలమి కౌఁగిటఁ జేర్ప నసమబాణములు
జలజాయతాక్షి విచ్చనవిడిని తను మఱచి
యలర నేర్పులు నెఱపదాయె నేఁటికిరా. ॥ ౨౯ ॥

**భైరవి**

**పల్లవి**

ఎంత సేసెఁబో దైవ మింతలోన నయ్యో
సంతపాకలంజవలె చల్లుఁ జూపు లేఁటికి.

**చరణములు**

తల్లులు బిడ్డలు మందలలోన నిందఱును
చల్లలమ్మే చేసేరు సంసారాలు
చెల్లఁబో నీ వుంగరాల చేతుల గోళ్లువెంచి
గొల్లదానవై యింత కొప్పువెట్ట నేఁటికి.
ఎడ్డెలైన వారిఁ జూచి యిట్టిమన్న కులమని
సడ్డ సేయరిందఱును జరయఁగాను
ఒడ్డుఁ బొడవగు గుబ్బ లొరయుచుఁ గానరాఁగా
దొడ్డవారికిఁ బయ్యెద తూల నింత యేఁటికి.
ముంగిట నిధానములు ములుగంగ సొమ్ములతో
సంగడి గొల్లెతలెల్ల జడియఁగాను

అంగడివేంకటపతి నలమి పట్టుక నీవు
చెంగలించి సొమ్ము గాఁగఁ జేసుకొంటి వేఁటికి. ॥ 30 ॥

రేకు-౪౭

## నాధనామక్రియ

### పల్లవి

ఏగతి నోఁచెనో యిందువదన యీ
బాగులు ఖేదముఁ బాపెడిని.

### చరణములు

తొలఁకెడి జలములతోడికన్నుఁగవ
తలఁచి డెందము తలఁకీని
అలయుచుఁ జలితో నాడినమాటలు
పలికిన నామది భ్రమసీని.
తొడరిన చెమటలఁ దోఁగినపయ్యెద
పొడగని దేహము పొగిలీని
ఉడికెటి వ్రేఁకపుటూర్పుల వేఁడికి
నుడిగిన నాలుక నొగిలీని.
కదిసిన తిరువేంకటపతిచేఁతలు
సుదతివిలాసము చూపెడిని
వదనము తావికి వలగొనుతేఁటుల
సదమద మగు రుతి చాటీని. ॥ 3౧॥

## శ్రీరాగం

### పల్లవి

వేడుక కాఁడవై విడివడి తిరిగేవు తుమ్మెదరో
చూడఁ జూడఁగఁదొంటి చూపు దప్పకువయ్య తుమ్మెదరో.

## చరణములు

తలఁపుఁదామరలోన తావై యుండుదు నీవు తుమ్మెదరో
తలఁపఁగ నీవె తలఁప వైతివి మమ్ముఁదుమ్మెదరో
పొలయఁ గమ్మని తావి పొందునఁ దిరిగేవు తుమ్మెదరో
పొలసినీ తిరిగేటి పొందులెఱుంగుదుము తుమ్మెదరో.
పచ్చని విలుకాని బంటవైతివిగద తుమ్మెదరో
మచ్చిక తలఁపులు మనలోనె సరివోలు తుమ్మెదరో
అచ్చపుదీమస మందరి కెక్కఁడిదయ్య తుమ్మెదరో
చిచ్చువంటి వెన్నెల చెలిమి సేయకువయ్య తుమ్మెదరో.
తిరువేంకటాద్రిపైఁ దిరమై నిలచినట్టి తుమ్మెదరో
పరమయోగుల పూలఁ బరిమళములు గొన్న తుమ్మెదరో
కరుణించి మామీఁదఁగలిగిన యీప్రేమ తుమ్మెదరో
ఇరవాయె నిటువలె నెలసివుండంగదవె తుమ్మెదరో. ॥ 32 ॥

## సామంతం

### పల్లవి

గుబ్బచన్నుఁగవ లెల్ల గుబ్బలి కొండలు మంచి
గబ్బితనములె కన్నుగానని వలపులు.

## చరణములు

తేనియల చెలమలు తియ్యనిమోవులు మించు
లైనయమృతపుఁబిల్ల లాననపద్మములు
మానైన చక్కెర బొమ్మలు మేనుదీగెలు
లేనగవు మెఱుఁగులు లేఁతవెన్నెలలు.
సానఁ బట్టిన తూపులు చక్కని చూపులు మంచి
వేనలి కమ్మని తావులానిన తుమ్మెదలు

చేనిపంటల కొల్పులు చెప్పరాని చెయ్దులు
మానమానని చింతలు మాటలలో మూటలు.
వెలలేని రచనలు వేడుకచేతలు వట్టి
పొలయలుకలు ప్రొద్దువోని బూటకములు
ఎలమితోఁ దిరువేంకటేశుని బొందినయట్టి
చెలియ గర్వము నేఁడు చెప్పఁజూపఁగతలు. ॥ 33 ॥

ముఖారి

పల్లవి

చూపు లోపలి చూపు చూడకుర వోరి నీ
పైపూఁత చూపులకుఁ బాలైతి మోరి.

చరణములు

తనువెల్లఁ గడువేఁడి దగ్గరకు రోరి నీ
యనుభవనచేఁ దమక మారదా వోరి
వెన్నుకొన్న నిట్టూర్పు విడువవలె నోరి నీ
మనసు మదనానలము మానదా వోరి.
ఉద్దుటైన కళలతో నున్నాఁడవోరి నినుఁ
గదియఁ జూచిన యింతి కలికిరా వోరి
వెదచల్లు నగవులకు వెరతుమిదె వోరి రతి
సదమదము కాటింత చాలదా వోరి.
వేవేలు సతులతో విహరింతు వోరినేఁడు
రావలసి నీ కింద్దురాఁ దీరెనా వోరి
ఆవేళలామమతలవియెఱుంగుదొరి నీకు
శ్రీవేంకటేశ్వరుఁడ చెల్లురా వోరి. ॥ 3౪ ॥

## ఆహిరి

### పల్లవి

ఏమి సేయఁగ వచ్చు నిట్టుండు భాగ్యవశ
మామనియుఁ దాఁ గూడెఁ నక్కటా చెలికి.

### చరణములు

తుడువరే కమ్మఁ గస్తురి బొట్టు నొస లెల్ల
కడుఁ గ్రాఁగి పొక్కె నదె కటకటా చెలికి
కడుగరే శిర సెల్లఁ గ్రాఁగి జవ్వాదిచే
జెడగట్టె ముంగురులు చెల్లఁబో చెలికి.
తియ్యరే నునుఁగౌనుఁ దీగ యొడ్డాణంబు
నొయ్యనె యిఁకనైన నొప్పదీ చెలికి
ముయ్యరే కుచకుంభములు బయలు పడకుండ
పయ్యదయు సవరించ భారమీ చెలికి.
చూపరే నాయకుని సుదతికి మేనెల్ల
ఆపసోపము రేఁగె నద్దిరా చెలికి
ఏపుమీఱఁగ వేంకటేశు డింతట వచ్చి
తాప మింతయు మాన్పి దక్కఁగాఁజెలికి. ॥ 38 ॥

## శంకరాభరణం

### పల్లవి

మచ్చికల మఱపులకు మదనబాధల మేను
వెచ్చినా నేమిటను విడువదీబాధ.

### చరణములు

తను వయో మదమునకుఁ దమకములచే బాధ
గొనకొన్న తమికి రతికోర్కి బాధ
అనుభవనరతికిఁ బాయని ప్రేమముల బాధ

ఘనకూటమికి వియోగములచే బాధ
తఱి విరహ వేదనకు తలపోఁతచే బాధ
పఱచుఁదలఁపులకుఁ దాపముల బాధ
తఱచు తాపంబులకుఁ దడఁబాటుచే బాధ
పఱివోనినేర్పులకు పరవశము బాధ.
అలరు సింగారముల కలపుఁ జెమటల బాధ
చెలియ చెమటకుఁ దావిచేతి బాధ
కలికితనములకు వేంకటవిభుని రతిఁ గూడి
కొలఁదికిని మిగులు సిగ్గులచేత బాధ. ॥ ౩౬ ॥

**రేకు-౪౭** **రామక్రియ**

**పల్లవి**

వెఱవక యింత విన్న వించఁగలమా నీ
మొఱఁగులు మానరా మొక్కేము నీకు.

**చరణములు**

దేవతలిందఱు నీకుఁ దిరిగి తిరిగి మ్రొక్కి
దేవుండవు నిన్నుఁ దిట్ట వచ్చునా
గోవిందుఁడవైన నీకొయ్యతనాలకుఁ గడు
మోవనాడ వెఱతుము మొక్కేము నీకు.
చెలువుగ నజుఁడు పూజించె నీపాదాలు
తొలఁగక కాల నేఁ ద్రొక్క వచ్చునా
కలికితనముల వికారపుచేతల నా
మొలనూలు వట్టకురా మొక్కేము నీకు.
ఒక్కటై శ్రీసతిఁ బాయకుండ నీవురమున
మొక్కలపు నాగుబ్బలు మోవ వచ్చునా

చక్కని వేంకటగిరిస్వామి నన్నుఁ గూడితివి
మ్రొక్కిన మొక్కుల మారు మ్రొక్కేము నీకు. ॥ 32 ॥

## శ్రీరాగం

### పల్లవి

తనివి దీరక నన్ను తమకమున నెంతేని
చెనకేవు వద్దు నీ చిత్తమిఁక నోరి.

### చరణములు

దంటవై నాచేతఁ దలఁపించు కొనఁగ దొర
కొంటి వింక నిది నీకు కొలఁదిఁ బడునా
నంటున నాప్రియము నాఁటిలను నిన్ను నా
వెంటద్రిప్పక నిన్ను విడుతునా వోరి.
గబ్బివై నావాలుఁ గనుఁగొనల నవ్వులకు
నుబ్బేవు నీవు నీ వొడఁబడికల
నిబ్బరపు నావలపు నెలకొన్న యపుడేని
అబ్బురంబగు గర్వమణఁచనా వోరి.
మెట్టుకొని నీవు నామెఱుఁగుఁ బయ్యెద చెఱఁగు
పట్టేవు నీకు నీపరిణామమా
దిట్టవై కూడితివి తిరువేంకటేశ్వరుఁడ
యిట్టట్టు నిన్నుఁ బోనిత్తునా వోరి. ॥ 33 ॥

## లలిత

### పల్లవి

బాల బొమ్మచారివి పట్టపువికారివి
ఓలినీ వెవ్వరిఁగన్నా నూరకుండేవా.

## చరణములు

దొంగిలి వెన్నలుఁ బాలు దొడికేటినీచేయి
ముంగిట నిధానమున్న మోసపోయీనా
చెంగట నిన్నెవ్వరైనాఁ జెనకి నవ్వినను
అంగవించి కొనగోర నంటకుండేవా.
సిగ్గరి గొల్లెతలపైఁ జిమ్మెడినీ చూపు
బగ్గన నచ్చినచోటఁ బారవేసేవా
దగ్గరి నిన్నెవ్వరైనాఁ దగులనాడినను
ఎగ్గెఱుఁగ కెందుకైనా నేఁగకుండేవా.
కొమ్మల చీరలు దీసుకొని యున్న నీవూ
దిమ్మరి చేఁతల నిట్టె దిగఁ దోసేవా
క్రమ్మర నావలెనె వేంకటగిరి విభుండా
బిమ్మిటిగాఁ గూడి ప్రేమ పెంచకుండేవా. ॥ 38 ॥

## సామంతం

### పల్లవి

విట్టలయ్య వీధికేఁగి వేగవచ్చెవో
కట్టుఁగాలువలసొంపు గందువు గాని.

### చరణములు

దూపిలి నొచ్చితివి తొయ్యలి మెచ్చితివి
భూపతిచెరువు దాఁకాఁ బోయిరా రాధా
యేపు మీర నీఁదులాడి యింతుల నిందరిఁ గూడి
వైపుగాఁగ మాపటెంతవత్తువు గాని.
యెండ దాఁకితివి కడు నిచ్చల రచ్చలు సేసి
కొండచరిఁబొలమోరఁ గూరుచుంటివో

కొండలెక్కి కడునిక్కి కూరుముల నాకు దక్కి
బొండుమల్లెలతోఁటకుఁ బోదువుగాని
విజయనగరములో వీధుల వీధుల వెంట
భుజమురికలతోడఁ బొద్దువుచ్చేవో
త్రిజగములు నేలిన తిరువేంకటేశుండ
భజన నిలిచితి భూపతి చెరువుకాడను. ॥ ४० ॥

## దేసాక్షి

### పల్లవి

ఇచ్చకపు మాటాలా యేతులాఁడా కడు
పచ్చిదేరే మే నెల్లఁబట్టకు నన్నింకనూ.

### చరణములు

దండగాఁగ మెడఁగుచ్చి తగిలించుకొంటివి
అండనుండే వారు చాల కాపె నొకతె
వెండియు నంతటఁ బోక వేగునంతకు నాడనే
పండి వచ్చితివి చాలు పట్టకు నన్నింకను.
పొద్దు వొద్దునకు తలఁబూజించుకొంటివి
వద్దనక యాకెమీఁది వాఁడుఁబువ్వులూ
ముద్దు సేసి యాకె తావి ముక్కు వాయ నియ్యనీ
పద్దుల మాటలె చాలు పట్టకు నన్నింకను.
చిందనీక యాకె మేని చిఱుఁజెమ టెల్లను
పొందుగ నామీఁదం దెచ్చి వూసినాఁడవూ
కందుఁగాక మేని వేంకటగిరి విభుఁడ నీ
పందెపుఁ గూటమే చాలు పట్టకు నన్నింకను. ॥ ४೧ ॥

## సామంతం

### పల్లవి

ఎంత మేలు చేసినదో యేమిచెప్ప చిత్త
మంతయు నీకిచ్చిన యొయ్యారి యెవ్వతెరా.

### చరణములు

దాడింబ పువ్వులవన్నె తళుకుఁబయ్యెద కొంగు
వేడుకతో వల్లెవాటు వేశి
గోడనిక్కి చూచి తనకొప్పు చెంగలువబంతి
నోడక వేసినయట్టి యొరపరెవ్వతెరా.
కంకణాల మెఱుఁగుల కరము లొయ్యన యిరు
వంకల చెలులమీఁద వైచి
కొంకక తమలపాకు కొనవంక గఱచి నీ
వంక చూచి సన్న సేసె వనిత యెవ్వతెరా.
పిక్కటిల్లునట్టి తన బిగువుఁజన్నుల కాంతి
వెక్కసమై యిరువంక వెడల
యెక్కువతోఁ దిరువేంకటేశుండ నిన్నుఁ గూడి
చెక్కునొక్కి కౌఁగిలించ్చె చిత్తిణి యెవ్వతెరా. ॥ ౪౨ ॥

రేకు-౪౯ గౌళ

### పల్లవి

అల్లవాఁడే వాఁడల్లవాఁడే
యెల్ల లోకములకుఁ దానేలికైనవాఁడు.

### చరణములు

దొడ్డమేఁక పొలగూడు దోమటి దొడికినాఁడు
గడ్డువయసగు బిడ్డగన్నవాఁడు

నడ్డి ముక్కుతోడ వెట్టి నవ్వులు నవ్వినవాఁడు
అడ్డపాపఁడై యున్న ఆకుమీఁదివాఁడు.
ఆలి యిల్లు బొడ్డుతోడ నంటఁగట్టుకొన్నవాఁడు
కోలలేక లోకమెల్లఁ గొలిచినాఁడు
కాలువగా మింటి నీరు కాలఁదన్ని తీసినాఁడు
నేలకింది పరపుపై నెలకొన్నవాఁడు.
మించుల మించుల వన్నె మెకము నేసినవాఁడు
దంచేటి కైదువచేఁదనరువాఁడు
కంచముగా గొల్లవారి కడవలపాలెల్ల
వంచుకొని దోసిట వారవట్టువాఁడు.
పోటుమీరిన యసురపురము లిన్నియుఁ జొచ్చి
వీటిబుచ్చి దుమ్ములుగా వేసినవాఁడు
బూటకపుసురలతోఁ బున్నమ కప్పురమున
కూటువగాఁ జాపకూడు గుడిచినవాఁడు.
అల్లిందామరల పొందులైన కన్నులవాఁడు
తల్లిఁ గూఁతుఁ గౌఁగిటఁ దగిలినాఁడు
చల్లనైన వేంకట శైలముపై నున్న
నల్లని మేనివాఁడు నవ్వుమోమువాఁడు. ॥ ४3 ॥

## సామంతం

### పల్లవి

మనసునఁ బొడమిన కోపము మనసునకంటెను ఘనమఁట
మనసిజుఁడుద్బోధకుఁడఁట మాటల పని యేల

### చరణములు

దవ్వుల కొండల పవనుఁడు తనుతాప ప్రేరకుఁడట
నవ్వులఁ బుట్టిన చూపులు నాటెడియమ్ములఁటా

పువ్వులు సోఁకిన యంతనే పొక్కెడునఁట దేహంబులు
యెవ్వఁడెఱుంగును ఈవిధమేమని చెప్పఁదమూ.
చక్కఁదనములఁట గుండెలు జల్లనం జేయఁగలవఁట
మక్కువలఁట దేహంబులు మరవఁగఁ జేయునఁటా
కిక్కిఱిసిన తమకంబులు క్రిందును మీఁదు నెఱుఁగవఁట
ఱెక్కల పులుగుల పలుకులు ఱేఁపెడువుండ్లఁటా.
సంతసములుఁ జతురతలును సౌభాగ్యవిలాసములును
మంతనములు మోహంబులు మందులసంచులటా
యింతటికిని తగుమూలం బీవేంకటవిభుఁడట
యింతితలంపునఁ గలుగుట లేఁక నెన్నఁగనేలా. ॥ ౪౪ ॥

## కన్నడగౌళ

### పల్లవి

హరి రసమవిహారి స తు
సరసోయం మమ శ్రమసంహారీ.

### చరణములు

దయానివృతతనుధారీ సం
శయాతిశయసంచారీ
కయా ప్యజితవికారీ
క్రియావిముఖ కృపాణధారీ.
సదా మిథ్యాజ్ఞానీ స తు
మదాలిమతాభిమానీ
తదాశ్రితసంధానీ స తు
తదా తదా చింతాశయనాని.
పరామృతసంపాదీ
స్థిరానందాస్వేదీ

వరాలాపవివాదీ శ్రీ
తిరువేంకటగిరి దివ్యవినోదీ. ॥ ౪౫ ॥

## సామంతం

### పల్లవి

తత్తా తిగుడి దింధి తక దింధిం
తిత్తి తిత్తితి తితి తితి తితి.

### చరణములు

దానవవదనవితానదాన సం
ధాన రుధిరనిజపానమిదం
నానాభూతగణానాం గానం
దీనజనానాం తిత్తితి తితి.
విమతదనుజమత విభవపరిభవిత
సమధికం తవ శౌర్యమిదం
ప్రమదాభవ్యం ప్రమదాభరణం
తిమిరనిరసనం తిత్తితి తితి.
తిరువేంకటగిరి దేవనిధానం
పరమామృతరసభాగ్య మిదం
కరుణావరణం కమలాఘటనం
తిరొ తిరొ తిత్తితి తితి తితి. ॥ ౪౬ ॥

## నాట

### పల్లవి

తిరొ తిరొ జవరాల తిత్తి తిత్తి యీ
తరలమైన నీత(తా?) రహార మదురే.

### చరణములు

ధిమి ధిమ్కి తోంగ తోంగ దిద్దిమిక్కి ఆరే
మమారే పాత్రరావు మజ్జా మజ్జా
కమలనాభుని తమకపుటింతి! నీకు
నమరెఁదీరుపు ఇదే అవధరించఁగదో.

ఝకజక్క జంఝం ఝణణకిణాని
ప్రకటపు మురువొప్పె భళాభళా
సకలపతికి సరసపుఁగొమ్మా నీ
మొకసిరి మెరసె చిమ్ముల మురిపెములా.

మాయిమాయి యలమేలుమంగ నాచ్చారి మతిఁ
బాయని వేంకటపతి పట్టపురాణి
మ్రోయఁ జిరుగజ్జెలా నీ మ్రోఁత లానేని
సోయగమైన నీ సొలపుం జా పమరే. ॥ ४८ ॥

### శ్రీరాగం

### పల్లవి

అతిశోభితేయం రాధా
నతతవిలాసవశా రాధా.

### చరణములు

దర్పకబలబోధా రాధా
తర్పణగంధవిధా రాధా
దర్పయుతక్రోధా రాధా
దర్పకరసవేధా రాధా
తారితావరోధా రాధా
తారుణ్యోద్బోధా రాధా
ధారితానురోధా రాధా

దారితాపరాధా రాధా.
తరుణీమరుగాధా రాధా.
ధరసమకుచబాధా రాధా
తరుణసదనుబోధా రాధా
ధరణిదుస్సాధా రాధా. (?)
తనుభవగురుగాధా రాధా
స్తనకృతగిరిరోధా రాధా
తనువరవచనసుధా రాధా
ధ్వనిజితపికమేధా రాధా
తరుణసఖీసవిధా రాధా
దరశశిరుచిసౌధా రాధా
తరళితతటిద్విధా రాధా
దరహాసనవరోధా రాధా
ధనగర్వనిషేధా రాధా
స్తవతత్పర విబుధా రాధా
ద్రవధునీకృతసుధా రాధా
దవమదనవ్యాధా రాధా.
తరుణత్వ పురోధా రాధా
తరుణస్మరయోధా రాధా
తరుపశుమణిగుణధారక బహుల వి
తరణపరా బహుధా రాధా.
దైవికసుఖోపధా రాధా
ద్రావకనిజాభిధా రాధా
శ్రీవేంకటగిరిదేవకృపాము
దావైభవ నాథా రాధా. ॥ ४౮ ॥

రేకు-౫౦ ముఖారి

పల్లవి

ఏమి సోద్యం బిదియు నెన్న నాశ్చర్యంబు
కామాతురులకుఁ జీఁకటి వెన్నెలాయె.

చరణములు

ధవళమగుకలుహారదళ నఖంబులచేత
యువతి కుచగిరులఁజంద్రోదయం బాయె
తివిరి ముఖచందురుని తెలివి యౌవనసుధా
ర్ణవమునకు సురతమధనంబు ఘనమాయె.
తొడరి నవఘర్మబిందువుల వానలు గురియుఁ
గడఁగి కచనీల మేఘము గారుక్రమ్మె
విడువ కిటు సంతసపు వెల్లి పైపై నిగుడ
కడిది నిట్టూర్పు సురగాలి వీతెంచె.
తలకొన్న సాత్త్వికోదయముచేఁ బరవశం
బలమి సౌఖ్యములు దెలివి పడదాయె
వలచి తిరువేంకటేశ్వరునిం బొందిన మరుని
తలఁపు లన్నియును ముందర వెనుక లాయె. ॥ ౪౯ ॥

ముఖారి

పల్లవి

కొమ్మమనసు దెలియరాదు కోరి కలరఁగోనేటి
తిమ్మని తలంపులెల్లఁ దెలియ నెవ్వరివసమురా.

చరణము

నిన్నుఁ దలఁచి పులకరించి నెలఁత చలి యటంచుఁజెలుల
కన్ను మొఱఁగి పయ్యదకొంగున కప్పు నొయ్యన దేహము

సన్నపుఁ జెమట నొసలఁ బొడమగన్నులు దేలగిలఁగఁజొక్కుచు
మిన్నక మదన మెత్తె ననుచు మెలుఁత తమ్ముల ముమియ
వెక్కసమైన యూర్పుఁగముల వెల్లువ లొయ్యన నిలిపి నిలిపి
పుక్కిట నించి గుబ్బలమీఁద పొలయఁ జెమట లార్చును
మిక్కటమైన కన్నులనీరు మెఱుఁగు రెప్పలతుదలనాన
చుక్కలం జూతమనుచు లేచి సుదతిమాయలు నేసును.
చెక్కిట నీవు సేసినముద్దుల చేఁతలు చెలుల కెల్ల మొఱఁగి
చెక్కునఁజెయి మోఁపుకొనుచు చెలియ యొయ్యనె గప్పుదు
యిక్కు వెతింగి వేంకటాచలేంద్ర నీవు రమణిఁ గలసి
చొక్కపుఁజేఁతల నుల్ల మరసి చొక్కఁ జేసి తౌదురా. ॥ ౫౦ ॥

## పాడి

### పల్లవి

రమ్మనవే మాని రచనలు తా
నెమ్మదిఁ గూడిన నేఁడే రేపు.

### చరణములు

నల్లని మేనికేలే నడురేయి తన
తెల్లని కన్నులకేలే తెల్లవాఱను
కల్లజంపులుసేసి కాఁకలఁ దా
బల్లిదుండై తేఁ బగలే రేయి.
సిగ్గుల మోము కేలే చిఱునవ్వు తన
నిగ్గుల చూపులకేలే నెరసులు
దగ్గఱి యింకా నేలే తమకము తా
వెగ్గలము వలచిన వెలియే లోను.
తావులమేనికేలే తాపము తన
కావులకన్నుల కేలే కనరులు

శ్రీవేంకటపతి చెలువుండిట్లే
కావలె నంటే కడయే నడుము. ॥౫౦॥

## శ్రీరాగం

### పల్లవి

కొల్లవలపులు చేకొనరాదా కడు
మెల్లని మాటాడరాదా మెకురేల సేయను.

### చరణములు

నిక్కి నిక్కి చూచెఁగా నీవంక నెవ్వతో
మొక్కిన తెప్పల నింపు ముంచిముంచి
ఇక్కడ నీవుండఁగాను ఎంత గోపించునో
గ్రక్కున విచ్చేయరాదా కడుఁ దడవాయెను.
కన్ను సన్న జేసిన కలికి య దెవ్వతో
సన్నపు నవ్వులు నీపైఁ జల్లిచల్లి
ఎన్నరాని కాఁకలను ఏమిచేసునో నిన్ను
వన్నెలాఁడి నిను నింత వలపించుకొన్నది.
కొప్పు గడు దీర్చి తనకొనగోళ్ల నెవ్వతో
చెప్పరానిసిగ్గు నీపైఁ జిమ్మిచిమ్మి
యిప్పడె శ్రీవేంకటేశ యింతిం గూడుకొంటి వౌర
యెప్పుడుఁ బాయక మమ్ము నిక్కడ నీవుండరా. ॥౫౨॥

## సామంతం

### పల్లవి

తగని మాటలేలె తలపోఁత లవి యేలె
తెగు వేలె యిటువంటి దిట్టతన మేలె.

## చరణములు

నున్నని చెమట లేలె నొసలఁ బట్టిదియేలె
చిన్నఁబోయియుండనేలె చెక్కిటఁ జేయేలె
విన్నని నగవు లేలే వెరగుఁజూ పిదియేలె
కన్నులఁ గోప మదేలె కాఁతాళమేలె.
వ్రేఁకపుటూరుపు లేలె వెచ్చని మే నిదియేలె
తాఁకియుఁ దలఁచ వదేలే దప్పిదేర వదేలే
చీఁకటి ద్రవ్వెదవేలె చీటిన‌ఁ బలుకవేలె
ఆఁకలిదడవవేలె అవలిమోమేలె.
కొప్పు వదలిన దేలె గుబ్బలపై జీర లేలె
దప్పులు మోమున నేలె తడఁబాటు లేలె
చెప్పక దాఁచెదవేలె చెలియరో తిరువేంక
టప్పనిఁ గలసి మమ్ము నణఁకించె వేలె. ॥ ౭౩ ॥

## శ్రీరాగం

## పల్లవి

మగవాఁడు మాయకాఁడు యీ
జగడంపుం జనవులు సతములౌనాయమ్మ.
నిండిన నీమది నాతఁడు నిజముగ
నుండంగానే ఉడికే వేలె
అండల యాసల నాఁకలా యిటువంటి
యెండ చూపులను దప్పులేల తీరునోయమ్మ.
మందపు నవ్వుల నాతఁడు మాటలు
చిందంగానే చిమిడే వేలె
అందియు నందని యాసల నిటువంటి
చందమామగుటకలు సతము లవునా యమ్మ.

కలికి వేంకటరాయఁడూ కౌఁగిట
నలరంగానే అలసేవేలె
చెలువఁ డాతతి చేఁతల నిటువంటి
తొలు మించు మెఱుఁగులు తొడవులౌనాయమ్మ. ॥ ౫౪ ॥

## శుద్ధవసంతం

**రేకు-౫౧** పల్లవి

లోనివారి మొఱఁగేటి లోకదొంగవు కనిం
గాననట్టె రాకు మామంగారు వినేరు.

## చరణములు

వడికి రేయివచ్చి నాతోడనే కడు
వెడమాటలాడేవు వేసదారివి
కడఁగి యిందాఁకా నెక్కడనుంటివో మాట
కడునాడకుర మామంగారు వినేరు.
తొట్టెల పాపఁడ వింతె తొడ్డవాఁడవూ చల
పట్టి నాతొడలమీఁదఁ బవ్వళించేవు
పట్టకుర నాచెలఁగు బలిమి నీవు మొల
కట్టురవములు మామంగారు వినేరు.
పగ సాధించ వచ్చిన పంతగాఁడవూ ఈ
వగఁబట్టి మంచ మెక్కి వానిఁ జూసేవూ
నగకురా వేంకటనాథ నీవు మేను
గగురు పొడిచి మామంగారు వినేరు. ॥ ౫౫ ॥

## శంకరాభరణం

పల్లవి

గుఱు తెఱిఁగిన దొంగ కూగూగు వీఁడె
గుడిలోనె దాఁగేని కూగూగు.

### చరణములు

నెలఁతల దోఁచేని నీళ్లాడఁగానె
కొలని దరిని దొంగ కూగూగు
బలువైనవుట్ల పాలారగించేని
కొలఁది మీటిన దొంగ కూగూగు.
చల్ల లమ్మంగ చనుకట్టు దొడికేని
గొల్లెతలను దొంగ కూగూగు
యిల్లిల్లు దప్పక యిందరి పాలిండ్లు
కొల్లలాడిన దొంగ కూగూగు.
తావుకొన్న దొంగఁ దగిలి పట్టుండిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీవేంకటగిరి చెలువుండొ యేమొ
కోవిదుఁడగు దొంగ కూగూగూ. ॥ ౫౬ ॥

## నాదరామక్రియ

### పల్లవి

మనములోని విభుఁడు మఱవఁడే కాలంబు
నినుఁగలయనున్నాఁడు నీకేలె వెఱవ.

### చరణములు

నెలనాళ్లవాఁ డొకఁడు నిర్మలంబైన రె
న్నెలలవాఁ డొకఁడు మూన్నెలలవాఁ డొకఁడ
నెలలు పంద్రెండ్లైన నిజబాలుఁ డొక్కండు
నెలఁత యింతటి పనికె నీకేలె వెఱవ.
ప్రొద్దుపొడుపుల దొకటి ప్రొద్దు గ్రుంకుల దొకటి
ప్రొద్దువ్రొద్దులకు రహిపొయ్యేటి దొకటి
పొద్దెఱింగిన దొకటి పొద్దెఱుంగని దొకటి
నిద్దంపుఁ బువ్వులకు నీకేలె వెఱవ.

నిండుఁ జంచల మొకటి నిమిషమాత్రము దొకటి
వుండి నట్లనె వుండి వుడి వోవునొకటి
కొండలలో నెలకొన్న కోనేటిరాయండు నీ
నిండుఁ గౌఁగిటఁ గూడె నీ కేలె వెఱవ. ॥ ౫౭ ॥

## సామంతం

### పల్లవి

యెన్ని మారులు యిట్టె నీపనులు
ఇన్ని మాయలు నన్ను నేఁచనేఁటికిరా.

### చరణములు

నీళ్లే నమలేవు నీలోనె సన్నల
వేళ్లే చూపేవు వెలుపలికి
పేళ్లె తప్పేవు బిరుసుగ నింతేసి
గోళ్ల రాచేవు కోపమేఁటికిరా.
మేనె దాఁచేవు మెస్త్రిర గొడ్డలి
నానం బెట్టేవు నయమునవే
పోని తెరువుల పోకులఁ బోయేవు
కానిరా యేటివంకలు తిద్దవశమా.
చేరి కపటాలె చేసేవు యిఁకనైనా
సారెం బరువులు చాలించరా
ధీరుండవుగాన తిరువేంకటపతి
కూరి మెఱిఁగి నన్నుఁ గూడితి విపుడూ. ॥ ౫౮ ॥

## ముఖారి

### పల్లవి

ఏడకేడ యెంతకెంత యెక్కడికి నెక్కడ నీ
తోడ నలుగఁగ నంత దొడ్డదాననా.

## చరణములు

నాకు నీకు నేమి వోదు నాఁడె నాఁటి కాయెఁబోయె
పోకుమంటా నాఁగేవు పొద్దువోదా
పైకొన చుట్టచికానం బగ సాధించఁగ నీకు
లోకము లోపలను మెలుంతలు లేరా,
నన్ను నేల చెనకేవు నా తెరువు నీకునేల
నున్నట్ల చక్కఁజాడ నుండరాదా
కన్నుల లేనగవుల కసరుల జంకెనల
సన్నలఁదిట్టఁగ నే నీ సరిదాననా.
నాదెస యేమి చూచేవు నమ్మిక బాసలె చాలు
సేద దేర నేమైనాఁ జేయరాదా
ఆదరించి నన్ను వేంకటాద్రీశ కూడితివి
కాదన నీకంటె నేఁ జక్కని దాననా. ॥ ౨౯ ॥

## రామక్రియ

### పల్లవి

బిడ్డఁ డంటా నమ్మి యెట్టు వెట్టుకొన్నా రిందుకంటె
గొడ్డువో మేలు యిట్టి కొత్త లెందుఁగలవా.

### చరణములు

నోరినిండాఁ జన్ను లేక నొగిలెడిఁ బాప మయ్యో
ఊరివారిపాపఁ డఁటా నొకయింతి
నేరుపునం జన్నియ్యంగ నెత్తు రెల్లఁ దాగి తాగి
గోరపెట్టి చంపె నిట్టి కొత్త లెందుఁగలవా.
ఎత్తుకొనేవారు లేక యేఁకరే నటంచు నొక్కఁ
డెత్తుకొని వేడుకతో నేఁగఁగానే

బత్తిగలవానివలె ప్రాణము వోయినదాఁకా
కుత్తుక బిగించె నిట్టికొత్త లెందుఁగలవా.
నిప్పువలె నెండగాయ నీడలే దటంచుబండి
యొప్పుగం జాటిడి తనకుండంగానే
అప్పుడు వేంకటరాయఁ డడ్డపాపఁ డరకాల
కుప్పవడఁ దన్నె నిట్టి కొత్త లెందుఁగలవా. ॥ ౬౦ ॥

**రేకు-౫౨** **శుద్ధదేశి.**

**పల్లవి**

వెన్నెలలబయట వేడుకకాఁడ
యిన్నే సిలాగుల నెలయించితిగా వోరి

**చరణములు**

నగుతానె సారెసారె నాతో నీవింతేసి
పగటులు నెరపేవు బాపురా
తెగి నిన్నుఁ జూడలేను తెమలకుండఁగలేను
సగము బీరము నాపైఁ జల్లితిగావోరి.
నయమున నిట్లనె నన్నుఁ గడుఁ గరఁగించి
బయ లీఁదించం జూచేవు బాపురా
నియమించలేను నిన్ను నిమిష మెడయలేను
ప్రియము భయము నాపైఁ బెట్టితిగా వోరి.
తక్కులనే పెట్టి పెట్టి తనివి దీరని నీ
పక్కఁబాయ నియ్యవైతి బాపురా
చక్కని వేంకటగిరిస్వామి నీపాదాల కే
మొక్కఁగానే యింపులు ముంచితిగావోరి. ॥ ౬౧ ॥

## ఆహిరి

### పల్లవి

ఎటువంటి బిడ్డండె యితఁడు
ఇటువంటి వయసుననె యిట్లఁజేసీని.

### చరణములు

నడుఁక కెటు నీటిలోనె యీఁదులాడేని
తడవి పట్టెదమనిన దాఁగిపోయీని
తడఁబడక నేలగుంతలువోవఁ దవ్వీని
కడపమీఁదనె వుండి కదలఁడెప్పుడును.
కలిమిలే మెఱుంగఁడిదె కల వెల్ల నడిగీని
చలమ రెవ్వరినైనఁ జావ నడిచీని
అలయ కడవులవెంట నాటలకే తిరిగీని
తొలఁగకిటు గిరులెక్కి దుముకు లాడీని.
విచ్చన విడినె తడువు విడిచి పారెడిని
రచ్చలనె యింత గుఱ్ఱము వంటికొడుకు
దిచ్చరీఁడై యిట్లు దిరువేంకటేశ్వరుండు
నిచ్చ నిచ్చలును గడుఁబెచ్చు వెరిగీని. ॥ ౬౨ ॥

## లలిత

### పల్లవి

బాలుండై రేపల్లె లోపల
నాలరియాటలె యాడెనే యితఁడు.

### చరణములు

నెలఁతల సన్నపు నెన్నుదుళ్లపై
నెలయింతలరతి నిలు గట్టి

కెలపుల నును జంకెనలనె కలయుచు
నలరి బొమ్మ పెండ్లాడెనె యితఁడు.
గుబ్బల మెఱుఁగుల గురుగులలోపల
నుబ్బనానఁబాలొగి నించి
ఒబ్బిడి గాఁ బెదవులనే నమలుచు
నబ్బిన యాటలె యాడెనే యితఁడు.
ఎప్పుడు నిటువలె నిండ్లు గట్టుక
కప్పురగందులఁ గలయుచునూ
తెప్పలఁ దేలుచుఁ దిరువేంకటగిరి
యప్పఁడు మహిమల నాడెనె యితఁడు. ॥ ౬౩ ॥

## భైరవి

## పల్లవి

అమ్మమ్మ యేమమ్మ అలమేల్మంగ నాచారమ్మా
తమ్మి యింట నలరుకొమ్మా వోయమ్మా.

## చరణములు

నీరిలోనాఁదల్లడించి నీకే తలవంచి
నీరికిందాఁ బులకించి నీ రమణుండు
గోరికొనఁ జెమరించిం గోపమేపచరించి
సారెకు నీయల కిట్టె చాలించవమ్మా.
నీకుఁగానె చెయిజాఁచి నిండాఁ గోపమురేఁచి
మేకొని నీవిరహాన మేను వెంచేని
యీకడాకడి సతుల హృదయమే పెరరేఁచీ
నాకు మడిచియ్యనైనా నానతియ్యవమ్మా.
చక్కఁదనములె పెంచి నకలముఁగాలదంచి
నిక్కపు వేంకటేశుండు నీకె పొంచేని

మక్కువతో నలమేల్ మంగనాచారమ్మా నీ
యక్కున నాతని నిట్టె అలరించవమ్మా. ॥ ౬౪ ॥

## శ్రీరాగం

### పల్లవి

చిఱునవ్వు మెఱుఁగారు సిగ్గుల మోముతోడ
మరగె నిన్నలమే ల్మంగ నాచారి.

### చరణములు

నిలువుఁదురుము మీఁది నెమలిపాదపుడాలు
తొలి మెఱుంగుల మించి దొలఁకఁగాను
అలరుచు నినుఁ జూచి అప్పుడె వెరగువడి
మలయుచు నలమేలుమంగ నాచారి.
పరగునీమెడ సరపణులవుయ్యాలలో
ఉరుటు మురిపమున నూఁగుచును
గిరికొన్న తమకాన కిందుమీఁదెఱుఁగక
మరచె మే నలమేలు మంగనాచారి.
కంచము గని మోవి కమ్మఁదేనే లారగించి
లంచముగఁగస్తూరి లప్పలు రాల
యెంచఁగఁ దిరువేంకటేశుఁడు నీ పాఁపసజ్జ
మంచమెక్కె నలమేల్మంగనాచారి. ॥ ౬౫ ॥

## శంకరాభరణం

### పల్లవి

నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలె.

## చరణములు

నిలువుల నటనలు నీకేలే యీ
నిలుగుల నడపులు . కేలే
నెలవులకరఁగులు నీకేలే యీ
కులికెటి నును సిగ్గులునీకేలే.
నెఱుల చెదరులివి నీకేలే యీ
నెఱవగు చదరులు నీకేలే
నెఱతనపుసరులు నీకేలే యిదె
చెఱఁగునమూసెదు చెలి నీకేలే
నిక్కపుఁబోఁకులు నీకేలే యిదె
నిక్కలగంటివి నీకేలే
నిక్కితి వొరపుల నీకేలే యిదె
దక్కె వేంకటోత్తముఁడు నీకేలే. ॥ ౬౬ ॥

**రేకు-౫౩** **హిందోళవసంతం**

## పల్లవి

వన్నెల యేఁచేరే నగుబాట్లు
అన్నింటా నాకె ఘనమై యుండుఁగాక.

## చరణములు

నాకేలె యీసింగారాలు నాకేలె యీనటనలు
ఆకడ నాతఁడు సుఖ మందఁగాను
కైకొనె నాతనిచెంతఁ గల దెల్ల నామనసు
ఆకె పట్టపుదేవు లైయుండుఁగాఁక.
నేనేలె యాతనికి నేనేలె బాలకిని
ఊనిన సుఖమునం దా నుండఁగాను

కానిక లాకె నవ్వులు కన్నులఁ బట్టఁగను
ఆనేరుపులే చవులై యుండుఁగాక.
వద్దేలే నాతోడి పొందువద్దేలే తనకు
ఒద్దిక లక్కడం గలి గుండంగాను
గద్దిరియై కలసి వేంకటవిభుండు
అద్దొ యింకా నన్ను నణకించుంగాక ॥ ౬౭ ॥

## సామంతం

### పల్లవి

కస్తూరి వాట్లం గరంగేవు మైఁ
గస్తూరి నాతనిం గమ్మంగ రాదా.

### చరణములు

నీరు వసంతం నీపైఁజల్లిన
మారు కుమారు రమణి నీవు
సారపు నీరతి జవ్వాది చెమటల
నీరాతనిపై నించంగరాదా.
పువ్వులు నీపై బొలుపుగఁ బోసిన
నెవ్వ దీఱఁగ నీవతని
రవ్వగు నీ వుపరతులఁ గూడి తల
పువ్వులతని దిగఁ బోయఁగ రాదా.
పంకజమునఁ దాఁ బైకొని చేరి
వెంకటపతి నిను వేయఁగను
కొంకక నిరతింగూడి నీవు ముఖ
పంకజ మాతనిఁ బైకొనరాదా. ॥ ౬౮ ॥

## దేశాక్షి

### పల్లవి

మదవికారములు మ. నేవో, నా 4|2|180
యెదురనె నీవు నేఁ డింకాఁజేసేవో

### చరణములు

నందవ్రజములోన నాఁడు నీవు గొల్ల
మందల మగువల మరగించీనా
మందులుమాయలు మఱచితివో, యిప్పు
డిందూ నామీఁద నింకాఁ జేసేవో.
నలినాప్తకులుఁడవైనాఁడు నీవు ఇంతిం
గలకాలమెల్ల నంగడిబెట్టినా
మలినపు మాటలు మఱచితివో నన్ను
నెలయించి కాఁకల నింకా నేపేవో.
నరసింహుఁడవై నాఁడు నీవు పెక్కు
మురిపెంపు వికారములఁ బోయినా
తిరువేంకటేశ పొందితివి నన్ను నీ
యిర వైన యీ చేఁత లింకాఁ జేసేవో. ॥ ౬౯ ॥

## వరాళి-ఏకతాళి

### పల్లవి

ఇప్పు డిటు విభుఁ బాసి యింతలోననె నేఁడు
తప్పు లోపలి తప్పు దైవమా చెలికి.

### చరణములు

నగవు లోపలి యలపు నంపైన పొలయలుక
పగటు లోపలి వెరగు పచ్చివేఁడి

మొగము కాంతుల మెఱపు ముంచు నలకల చెదరు
పగలు చీఁకట్లాయె బాపురా చెలికి.
బలిమి లోపలి భయము పలుకుఁదేనెల కనరు
చెలిమి లోపలి చేఁదుచింత చెలికి
బలుపుఁగుచముల లోని బట్టబయ లగు నడుము
కలిమి లోపలి లేమి కటకటా చెలికి.
నిడుపు లోపలి కురుచ నీడలోపలియెండ
వడిమంచి తరువు విడువని తమకము
కడువేంకటేశ్వరుని కౌఁగిటను పరవశము
మడుఁగు లోపలి మైల మాన దీ చెలికి. ॥ ౨౦ ॥

## సామంతం

### పల్లవి

విరహపు రాజదె విడిదికి రాఁగా
సిరులఁ జేసె నిదె సింగారములూ.

### చరణములు

నెలఁత నుదుటిపై నీలపుఁగురులనె
తొలుతనె కట్టెను తోరణము
మొలకచెమటలనె ముత్యపు ముగ్గులు
అలరిచె మదనుం డదె చెలిమేన.
దట్టముగాఁ జింతాలతనే వడిఁ
బెట్టెఁ జప్పరము పెనఁగొనఁగ
పట్టినమైతావుల పరిమళములు
కట్టించెను చెంగట వలరాజు.
విందగు వేంకట విభుని ప్రేమచేఁ
బొందుగఁ బెట్టెను బోనాలు

ఇందువదన కీయిందిరావిభుని
కందుదేర నలుకలు చవిచేసె. ॥ ౭౦ ॥

## శ్రీరాగం

### పల్లవి

తెలియ దెవ్వరికిని దేవదేవేశ యీ
నెలఁత భావం బెల్ల నీవెఱుఁగు దిఁకనూ.

### చరణములు

నిలుచుఁ దలయూఁచుఁ గన్నీరు వాలిక గోళ్లఁ
జినుకు నివ్వెఱఁగుపడుఁ జింతించును
పులకించు నలయుఁ దలపోయు నినుఁ జిత్తమున
నిలువునంగన విధము నీ వెఱుఁగు దిఁకను.

కమలంబు చెక్కుతోఁ గదియించు నెన్నుదుట
చెమటఁ బయ్యెదఁ దుడుచు సెలవినగును
తమకంపుఁగోరికలు తరుణి యిదె నినుఁబాసి
నిమిష మోర్వఁగలేదు నీ వెఱుఁగు దిఁకను,

వెక్కసపు నునుదురుము వెడవదల నేరదు
చిక్కుదేరఁగఁ గొంతసిగ్గు వడును
ఇక్కువలఁ దిరువేంకటేశ నినుఁ గూడె నిదె
నిక్కమీ చెలివగల నీవెఱుఁగు దిఁకనూ. ॥ ౭౨ ॥

రేకు-౫౪ పాడి

### పల్లవి

చింత లేమనుచుఁ జేసితివో
కాంతాళించియుఁ గదలదు మనసు.

## చరణములు

నిలువునఁ బులకలు నిండెను నామెయిఁ
దలపున నేమని తలఁచితివో
సొలసియు నినుఁ గడు సోఁకఁగ నాడఁగఁ
దలఁచియు నాలికఁ దగులదు మాట.
తాపమె హృదయము దాఁకెం బయిపయి
చూపుల నేమని చూచితివో
కోపము కన్నులఁ గురిసి మోమున
నేపునఁ జిఱునగ వెడయదు నాకు.
ఆఁగిన కుచముల నలసారఁగ నా
కౌఁగిట నేమని కలసితివో
రాఁగవు వేంకట రమణుని చెమటలఁ
దోఁగియు వేడుక దొలగదు నాకు ॥ 23 ॥

## సాళంగనాట

### పల్లవి

పలుకుఁదేనెల తల్లి పవళించెను
కలికితనముల విభునిఁ గలసినది గాన.

## చరణములు

నిగనిగని మోముపై నెఱులు గెలఁకులఁ జెదర
పగలైన దాఁకఁ జెలి పవళించెను
తెగని పరిణతులతోఁ దెల్లవాఱినదాఁక
జగదేకపతి మనసు జట్టిగొనెఁగాన.
కొంగుజాఱిన మెఱుఁగు గుబ్బలొలయఁగఁ దరుణి
బంగారు మేడపైఁ బవళించెను.
చెంగలువ కనుఁగొనల సింగారములు దొలఁక

నంగజగురునితోడ నలసినదికాన.
మురిపెంపు నటనతో ముత్యాలమలఁగుపై
పరవశంబునఁ దరుణి పవళించెను
తిరువేంకటచలాధిపుని కౌఁగిటఁ గలసి
యరవిరైనునుఁ జెమట నంటినదికాన. ॥ ౭౪ ॥

## సామంతం

### పల్లవి

మంటలంటా బెదరీని మాణిక్యాలు చూచి చెలి
యింటిలోనూ నెరవాయె నేమిసేతమే.

### చరణములు

నిండుఁబరితాపమున నీలపుమణులమేడ
నుండరాక దేహమెల్ల నుమ్మగించంగా
పండు వెన్నెలల మంచిబయట నిలిచిచెలి
యెండనవి తల్లడించె నేమిసేతమే.
గ్రక్కనఁ జెలులుచేరి కప్పురపు బాగాలు
చెక్కువట్టి కదలించి చేతి కియ్యంగా
పొక్కుచుఁ జెలులఁ గన్ను బొమ్మలవిండ్లఁగోప
మెక్కువట్టి యేయఁ జూచి నేమిసేతమే.
పాయక వేంకటపతి పచ్చఁబట్టు ముసుఁగులో
సోయగపురతులను చొక్కుచునుండి
రాయడి నెవ్వతె పసపాయెనో పచ్చడమని
యేయెడ నైనా దూరే నేమిసేతమే. ॥ ౭౫ ॥

## పాడి

### పల్లవి

నెఱజాణ తనమూ నీ కింత కలదట
చిఱునవ్వుఁ జెలికింత చింతైనవలదా.

### చరణములు

నిక్కమైన బిగువు నీకింత గలదట
చక్కనియింతికి వద్దా జడనైనాను
ఎక్కడో నీమనసు ఎంతైనఁ గలదట
చెక్కుమీఁద దరుణికిఁ జేయైన వలదా.
నెలకొన్నకసరు నీ కింత గలదట
వెలఁదిమతికి వద్దా వెరగైనా
నిలువుఁజెలువమూ నీకింత కలదట
కలికిచెలికిఁ గొంత కాఁకైన వలదా.
నీమేనివెరపూ నీ కింతకలదట
భామకు వద్దా తలప ట్టయినా
నేమము వేంకటేశ నీ కింతగలదట
కామినికి నింత వద్దా కౌఁగిటనీచనవూ. ॥ ౭౬

## సామంతం-జంపె

### పల్లవి

ఎరవు గడు సత మాయె నిదియెకదవె
అరవీడుటే సొబగు లాయెఁ దురుమునకు.

### చరణములు

నిక్కముగ ననలమున నీరు జనియించెనను
టిక్కడనె పొడగంటి మిదియుఁగదవె

పొక్కుచును విరహాగ్నిఁ బొరలఁగాఁ జెలిమేనఁ
జక్కఁ బైపైఁ బొడమె జవ్వాది చెమట.
కలుగు ననలంబుకడ గాలి యనఁగా నదియు
నెలమి నిచ్చట కలిగె నిదయెకదవె
చెలఁగేటి చెలిమేనఁ జిత్త జాగ్నికిఁదోడు
నిలువ నియ్యక కలిగె నిట్టూర్పుగాలి.
నీడల నెండలును నెయ్య మలరఁగఁ గూడు
టీడనే పొడగంటి మిదియుఁగదవె
వేడు కలరంగఁ దిరువేంకటేశ్వరుఁ గూడి
వాడుదేరఁగఁ గలిగె వనిత పరవశము. ॥ ౭౭ ॥

భూపాళం

పల్లవి

నిండినయాసల యెండ నీడలాయె నేఁటికే
బెండువడ్డ మేనుఁదీగె బీరువోయెనేఁటికే.

చరణములు

నుదురైనశశి నీచన్నుల కేల జాతెనె
చెదరి నీముత్యాలు చెక్కుల కే లెక్కనే
ముదిత నీతో సిగ్గు ముంగి లేల వెళ్లనే
నిదురమానిన మోము నిగ్గులేల తోఁచెనె.
బచ్చన నీసింగారము బయలేఁటికాయెనే
ముచ్చట నీ మాటలకు ముసుగేలజాతెనే
వెచ్చిననీమేని సొంపు వింతదోఁచె నేఁటికే
మచ్చిక నీకోరికలు మదమెక్కె నేఁటికే.
చూపులు వెన్నెలమించుఁ జారలాడె నేఁటికే
కోపపు నీజంకెనలగొనబాయె నేఁటికే

ఏపుమీఱి తిరువేంకటేశుఁ గూడి నీకుఁ
దాపలైనతలఁపులు దరిచేరె నేఁటికే. ॥ ౭౮ ॥

**తేకు-౫౫** **వరాళి**

**పల్లవి**

నీకువలచిన సతికి నెగులు గలదా మీఁద
నీకరుణ మఱవ కింతియు చాలును.

**చరణములు**

నీవంటి చతురునకు నిక్కంబుగా వలఁచి
జీవంబు విడిచినా సేగిగలదా
భావముల నినుఁదలఁచి పడఁతి యిట్లాయెనని
ఆవేళ నను దలఁచు మంతేచాలు.
తగిలి నినుఁ బాసి సంతాపదావాగ్ని నిటు
నొగిలి నా నాకిందు నొప్పి గలదా
పగదేర మరునిపూబాణములఁ దెగినపొం
దుగ నప్పుడైన వగతువుగా నీవు.
కూరుముల నిటు నిన్నుఁ గూడినలతాంగికిని
వేఱె యిఁక మరుచేతి వెఱపు గలదా
సారమతి వేంకటేశ్వర నన్ను నలయించి
యీరీతి నైనఁ జన విత్తుగా నీవు. ॥ ౭౯ ॥

**భైరవి**

**పల్లవి**

భామ తొల్లిటి పూజఫలము సఫలముగాను
యేమఱక వేడుకల నిట్లఁ బూజించె.

## చరణములు

నొసలిలేఁ జెమటలను నునుఁగురులఁ బూజించె
కసిగాట్ల నధరంబు కలయఁ బూజించె
కొసరు కముఁగవ కెంపు కొనలఁ బూజించె
వసివాడు మేనిపై వాసనలఁ బూజించె.

మొలకనవ్వుల ముద్దుమో మలరఁ బూజించె
చిలుకుఁ జూపుల లోని సిగ్గుఁ బూజించె
నిలువుఁబూలకలచేత నిలువెల్లఁ బూజించె
నెలఁతచనుదోయి క్రొన్నెలలఁ బూజించె.

మనసుగోరికలకళ మర్మములఁ బూజించె
గొనకొన్న రతులచేఁ గొలికి పూజించె
ఎనసి శ్రీతిరువేంకటేశు కౌఁగిటిలోన
వనితసంభోగపరవశముఁ బూజించె. ॥ ౮౦ ॥

## పాడి

## పల్లవి

ఘుమ్మనియెడిశ్రుతి గూడఁగను
కమ్మనినేతులు కాఁగఁగఁ జెలఁగె.

## చరణములు

నీలవర్ణుఁ డని నీరజాక్షుఁడని
బాలుని నతివలు పాడేరో
పాలు విదుకుచును బాసల కాఁగుల
సోలి పెరుగు త్రచ్చుచుఁ జెలరేఁగి.

మందరధరుఁ డని మాధవుఁడని గో
విందునిఁ బాడేరు వెలఁదు లిదె

నందవ్రజమున నలుగడ నావుల
మందలఁ బేయల మంచిరవముల.
వేంకటపతి యని వేదనిలయుఁడని
పంకజనాభునిఁ బాడేరో
అంకులచేతను నలరురవంబుల
బింకపుమాటల బృందావనమున. ॥ ౮౧ ॥

## సామంతం

### పల్లవి

కొమ్మ నీ వెవో కోపింతు వతఁడు
రమ్మనఁగఁ బిలువ నిటు రావమ్మా.

### చరణములు

నెయ్యె మెఱింగి చెలియ నీవె పో యతనితో
చయ్యాటములనే పగ చాటేవు
కయ్యపుమాటలకు కనుచూపు కాఁకలకు
నియ్యకొన కతనిచన వియ్యవమ్మా.
అందముగ నతఁడు మాటాడఁగా నతనితో
మందమందమె కాని మాటాడవు
గొంది నిందాఁక చెక్కునఁ జేయి తియ్యవిదె
మందలించక వెనక మఱవవమ్మా.
ఇప్పు డిదె తిరువేంకటేశ్వరుఁడు పచ్చడము
కప్పఁగానే కొంత కసరేవు
రెప్పలను నవ్వుపచరించి తింతటిలోన
నెప్పుడును నిటువలెనె యెనయవమ్మా. ॥ ౮౨ ॥

## భూపాళం

### పల్లవి

అంతదొడ్డవారమా అందుకుఁ దగుదుమా
మంతనపుమాటల మరగించేవు.

### చరణములు

నిన్నుఁ బోలువారమా నీయంతవారమా
వెన్నెలుఁ జల్లలు నమ్మువెలఁదులము
పన్నినయీరత్నాల బంగారుటిండ్లలో
యెన్నకైనతూఁగుమంచ మెక్కు మనేవు
చెప్పరానివారమా చెమటపై వారమా
కప్పురంపుఁజవి యెఱుఁగనివారమా
చిప్పిలేటితేనెల సేమంతివిరుల
చప్పరములోనికి సారెఁ బిలిచేవు.
జంకెనలవారమా సరసపువారమా
మంకుమంకు మాటల మందవారమా
వేంకటాద్రి విభుఁడా వేడుకలరాయఁడా
తెంకికి నెప్పరిగమీఁదికి రమ్మనేవు. ॥ ౮3 ॥

## ముఖారి

### పల్లవి

నినుఁ బాసినయట్లు నెలఁతకు వియోగదశ
లెన్నడునుఁ దోఁప విది యేమోగాని.

### చరణములు

నినుఁ దలఁచి లలితాంగి నీరూప మాత్మలోఁ
గని నీవు నవి బయలు కౌఁగిలించినది

తనర నాకాశతత్త్వము నీమహత్త్వ మని
వనిత యెవ్వరిచేత వినెనోకాని.
నిను( బొగడి నీరూపు కనుదోయి కెదురైన
తనివిదీఱక బయలు తగ( జూడ(దొడ(గి
మునుకొన్న సర్వతోముఖు(డ వన(గా నిన్ను
వెనుక కేభావమున వినెనో కాని.
**తల**(పునను వాకునను( దల(ప( దల(ప(గ నీవు
**కలసి** యీకమలాక్షి( గౌగిలించితివి
తెలిసితిమి వేంకటాధిపతి నీ విన్నిం**ట(**
గలవనెడిమాట నిక్కంబువోకాని. ॥ ౮౪ ॥

**రేకు-౫౬** **రామక్రియ**

**పల్లవి**

నతు మమ తాస(వ?)న్మానస్త్వదీయ
**నితాంతహి**తసరణిం నమామి.

**చరణములు**

న **వదతు** భవాన్ జనార్దన ఘనరతి
వివాదవచనం వృథా వృథా
తవ మృదువేదసుధామయవచనై
ర్వివిధావశపదవీం వహామి.
న భజతు మాం కరుణానిధే భవ
ద్విభవవినయశ్చ వృథా వృథా
త్రిభువనసుఖకర దివ్యరూప తే
ప్రభుతయాపరాభవం భజామి.
న చలతు వేంకటనాథ మాం వినా
విచరణమపి తే వృథా వృథా

సుచరిత్రస్త్వం సుభగస్త్వం త్వాం
కుచయోః పులకాంకురై ర్ధరామి. ॥ ౮౫ ॥

కన్నడగౌళ

పల్లవి

ఒప్పుమి మేలై యొనఁగూడె నాకు
నె(త)?ప్పు లే ఒప్పవుట చెప్పనేలమ్మా.

చరణములు

నవ్వులచూపులు నాఁటినచోటు
నొవ్వులు సేయక నొచ్చీ నే
దవ్వులమాటలు తాఁకినతావూ
రవ్వలచేఁతల రాఁగీనే.
తియ్యపుఁజేఁతలఁ ద్రెవ్వినచోటు
వయ్యమై హృదయము నాడీనె
కయ్యపుఁగాఁకలఁ గ్రాఁగినతావూ
ఒయ్యన పైపై నుడికీనె.
కొండలరాయనిఁ గూడిన మనసూ
కొండయి లోలోనె కూడీనే
నిండినతమకము నించినయతఁడూ
మెండైన నాప్రేమ మెచ్చీనే. ॥ ౮౬ ॥

ఆహిరి

పల్లవి

ఇన్నియును దగఁగలిగె నీయింతి కిదె యిపుడు
కన్నియల కిందరికిఁ గలిగె మోహములూ.

### చరణములు

నిగనిగనిమెఱుఁగు వెన్నెలమోమునకుఁ గలిగె
చిగురుమోవికిఁ గలిగెఁ జిఱునగవులు
పగటుఁగనుఁగొనలఁ బలపలని కెంపులు గలిగె
పొగరుఁజెమటలు గలిగె పొలఁతిచెక్కులను.
ఒయ్యార మగు నలపు లువిదమేనికిఁ గలిగె
గయ్యాళి నడపులకుఁ గలిగె మురిపెములు
తొయ్యలికిఁ గలిగె సంతోషంపుఁబరవశము
పయ్యెదకుఁ గలిగెఁ బయిపైని నునుఁబూఁత.
వెలఁది కిప్పుడు గలిగె వేంకటేశ్వరుకరుణ
తలఁపులకుఁ గలిగె చింతావియోగంబు
పులకలకుఁ గలిగెఁ దలఁపులలోని జొంపములు
అలుకలకుఁ గలిగెఁ బాయని విలాసములు. ॥ ౮౭ ॥

## సామంతం

### పల్లవి

పలుకులఁదేనియ లొలికెడిచక్కని
వెలఁదులు కోనేటివిభునిఁ బాడెదరె.

### చరణములు

నలికపుఁజూపుల నగవుల నునుసిగ్గు
దొలఁకంగ నిగ్గు దోఁపంగ
కలికికికన్నుఁగవ కాంతలు ప్రేమ
నెలయించి తిరువేంకటేశునిఁ బాడెదరె.
పెదవుల సన్నపు బీటలమెఱుఁగులు
పొదలంగ ముద్దులు పొలయంగా

వదనము సొబగులు వనితలు కడుఁ
గదసి వెంకటగిరిఘనునిఁ బాడెద
భారపుఁ గుచముల ` న్నీటి చెమటలు
జారంగా తావిచల్లంగా
కూరిమిరచనలు గొసరుచుఁ గడు
ధీరునిఁ గోనేటితిమ్మనిఁ బాడెదరె. ॥ ౮౮ ॥

## సామంతం

### పల్లవి

ఎట్టుదొరికెనె చెలియ యిద్దరికి నిటువంటిఁ
పట్టనిలుపఁగరాని బరువైన వలపు.

### చరణములు

నిడివి తమకములచే నిట్టూర్పు లివె నీకు
అడియాసతమకంబు లాతనికిని
కడలేని వేదనలకన్నీ ళ్లివే నీకు
అడరుఁబరితాపంబు లాతనికిని.
గుఱుతైనయతనిపై గోరాట లదె నీకు
అరుదైన ప్రియమాన మాతనికిని
పురిగొన్న విరహమునఁ బొరలాట లవె నీకు
అరమరపుఁ బరవశము లాతనికిని.
ఎనసి యాతనిరాక కెదురుచూచుట నీకు
అనుకూలుఁడై కలయు టాతనికిని
అనయంబు తిరువేంకటాధీశుఁ డిడె నీకు
అనుభవన కెల్ల నీ వాతనికిని. ॥ ౮౯ ॥

## భైరవి

### పల్లవి

పట్ట కింత మాచెఱఁగు బాఁపఁడా నాఁడె
వుట్టిఁ గట్టితివి కుల మోబాఁపఁడా.

### చరణములు

పలుకుల వాదాలబాఁపఁడా యిట్టె
పలునీళ్ల మునిఁగె బాపఁడా
పలువంచలఁ బొరలే బాఁపఁడా యిట్టె
వొలికిజంటెలఁ గోప మోబాఁపఁడా.
పాయనియాసొదపు బాఁపఁడా ఇట్టె
బాయిటఁ బడె నీవిద్య బాఁపఁడా
పాయపుతలజడల బాఁపఁడా యిట్టె
వోయయ్య బతిమాలకు మోబాఁపఁడా.
పారవేసేవు సిగ్గెల్ల బాఁపఁడా యిట్టె
పాఱుతెంచేటి కమ్మటి బాఁపఁడా
భారపు వేంకటగిరి బాఁపఁడా మమ్ము
నోరసేయక కూడితి వోబాఁపఁడా. ॥ ౯౦ ॥

తేకు-౫౭

## నాట

### పల్లవి

ఇంకా నేఁటికి నింతులు
వేంకటరాయఁడ విడు విడు చెఱఁగూ.

### చరణములు

పిరిగొన్న ముత్యపుఁ బేరులనడుమను
తెరవను దాఁచుక తిరుగుచును

కెరలుచు నాకౌఁగిటికి దగ్గ్గఁజేవు
వెఱపు లేక నీవు విడువిడు చెఱఁగు
ప్రేమ మలర నతి బింకపునీనగు
మోమున నలముక మురియుచును
తామసమతితో తమ్ముల మిడుకొని
వేమరుఁ గోరక విడు విడు చెఱఁగు.
చుట్టుఁదపారపుచుంగులనడుమను
పెట్టితి వింపున ప్రియసతిని
రట్టడి వేంకటరమణుఁడ కలసితి
వెట్టిగాద యింక నిడు విడు చెఱఁగూ. ॥ ౬౦ ॥

## శ్రీరాగం

### పల్లవి

కటకటా విరహు లెక్కడ బ్రదుకఁగలవారు
కుటిలంపుఁగీరములు గూఁటఁ బడ వాయె.

### చరణములు

పంచబాణునకు నాపద లెందు లేవాయె
మంచుఁగిరణము లతనిమీద మణఁగదాయె
పెంచుకోవిలనోరు పెడతటికిఁ బోదాయె
చంచరీకములకునుఁ జావు లేదాయె.
చిగురాకుఁ గులమునకుఁ జే టెందు లేదాయె
పగటు నునుగాలిఁ బెనుఁబాము 'దినదాయె
సొగసుఁగమ్మని విరులచొ ప్పణఁగి పోదాయె
బిగువు నామనిమీఁదఁ బిడుగువడదాయె.
తిరువేంకటాచలాధిపుని కరుణారసము

తరుణులకు నందటికి దైవాజదాయె
పరివోనిసురతసంపదలఁ దెప్పలఁదేలి
వరవధూతతికిఁ బరవశము లేదాయె. ॥ ౯౨ ॥

## శంకరాభరణం

### పల్లవి

కుటిలా లేఁటికి కోమలియెడ నేఁ
డిటువలెఁ జేయఁగ నిం పౌనా.

### చరణములు

పుప్పొడిచల్లినఁ బొక్కౌటిదేహము
కప్పుర మేఁటికిఁ గలపేరె
ఒప్పుగ వేనీ ళ్లొల్లనిదేహము
నిప్పులు చల్లఁగ నిలచీనా.
వెన్నెలబాయుట వేగెటిమేనికి
పన్నీ రేఁటికిఁ బామేరె
సున్నపురాతికి జొబ్బిల నుదకము
మున్నతిఁ జల్లఁగ నోర్చీనా.
తిరువేంకటపతి తెప్పలఁ దేలఁగ
తరుణికి నేఁటికిఁ దాపములూ
దొరకొని దైవముతో మాటలాడఁగ
పరికెలు వెట్టఁగఁ బాడౌనా. ॥ ౯౩ ॥

## కాంభోది

### పల్లవి

ఇన్నియుఁ గొత్తలు దోఁచె నింతలోనె చెలి నీకు
విన్ననినగవు లెస్సవిధ మేఁటి కాయెనే.

## చరణములు

పెట్టినకస్తూరిబొట్టు పెదవిపై కేల జాఱె
కట్టిన చెంగావికెంపు కన్నుల కే లెక్కెనె
పుట్టిన లేఁజమటలు పులక లేఁటికిఁ గప్పె
పట్టిన తామరమొగ్గ పదనేఁటి కాయెనే.
కప్పినపయ్యదకొంగు కడకు నేఁటికి జాఱె
తిప్పిన మొగములోన తెలివేఁటికుండెనే
చెప్పినమాటలలోన చిఱునవ్వు లేల తోఁచె
ఒప్పైన చెలువ నీకు నొరపేఁటి కాయెనే.
నిండిన సైరణలకు నిజ మేల లేదాయె
పండినకోరికలకు ప్రాణ మేల వచ్చెనే
కొండలలో నెలకొన్నకోనేటిరాయఁడు గూడె
యెండలేనినీడ నీకు నితవేల ఆయెనే. ॥ ౯౪ ॥

## సామంతం

### పల్లవి

చక్కఁదనములు గొంత జాణతనములు గొంత నీ
వెక్కసము లెల్లఁ జాలు వేసాలఁ బోకురా.

### చరణములు

పూసినతట్టుపుణుఁగు బూమిలోనా లేనివింత
వాసనై లోకమువారి వలపించఁగా
ఆసలనే మమ్ముఁ గడు నలయించే వోరి నీవు
చేసినట్టి చేతు గాని చెఱఁగు విడువరా.
మెత్తినట్టి మృగనాభి మేన నెల్ల నిండె నిత్య
కొత్తలై నీ సొబగెల్లఁ గుప్పళించంగా

బిత్తరి చూపులతోడ ప్రియమైన కడకేఁగి
వత్తుగాని అంతకు నీవన్ని చూడనియ్యరా.
కట్టినట్టి పచ్చఁబట్టు కమ్మనిపువ్వులతావి
యిట్టు నట్టు నెల్లవారి నెలయించఁగా
దిట్టనాయకుఁడ వోరి తిరువేంకటేశ నీ
పట్టినచలమే దక్కె బాపు వూరకుండరా. ॥ ౯౭ ॥

## ముఖారి

### పల్లవి

అడవిచాటున నుండి యాఁటదానను న
న్నుడి కించే వేరా నీ వుడుకునను.

### చరణములు

పించెపుఁబయ్యదలోని పెనుగుబ్బలు మూయుచు
చెంచెత యేల యేఁచేవె చెల్లఁబో నన్ను
మంచుఁబులకలచాటు మగనాలిగుబ్బలు సో
ధించి చూచే వేర తెట్టఁదెరువునను.
తొలుకరి మెఱుఁగుల తొడలయాకుఁజీరచె
నలయించే వేఁటికి నీ వయ్యో నన్ను
నులివెచ్చమాటల నొవ్వ నామనము సోఁకఁ
బలికే వదేర బట్టబాయిటను.
చిక్కనితేనెలతావి చిగురుమోవి నవ్వుచు
చక్కఁజూడ కేల పగచాటేవె నన్ను
చక్కని వేంకటగిరిస్వామి నాకౌఁగిలి నీకు
పుక్కట దొరకె పొట్టఁబొరుగుననూ. ॥ ౯౮ ॥

రేకు-౫౮ ఆహిరి

పల్లవి

అపు డేమనె నేమను మనెను.
తపమే విరహపుఁదాపమనె.

చరణములు

పవనజ యేమనె పడఁతి మతేమనె
అవనిజ నిను నేమను మనెను
రవికులేంద్ర భారము ప్రాణంబనె
ఇవల నెట్ల దరియించే ననె.
యింకా నేమనె యింతి మతేమనె
కొంకక యేమని కొసరుమనె
బొంకులదేహము పోదిది వేగనె
చింకవేఁట యిటు చేసె ననె.
నను నేమనె ప్రాణము మన కొకటనె
తనకు నీవలెనె తాపమనె
మనుకులేశ ప్రేమపుమనకూటమి
ఘనవేంకటగిరిఁ గంటి ననె. ॥ ౯౭ ॥

ఆహిరి

పల్లవి

అంతకంతకును వెఱపయ్యీని
యెంత నను వలపించి యేఁపేవో యనుచు.

చరణములు

పయ్యె దెడలించి గుబ్బల నిన్ను నలమఁ బ్రియ
మయ్యీని మిగుల వెఱ పయ్యీని

గయ్యాళిరతుల నను( గర(గించి మరుబారి
నుయ్యాలపాలయలుక నూ(చేవో యనుచు.
వెడవెడని తమ్ములము వీడుదోడాడ మన
సడరీని తల(ప వెఱపయ్యీని
పడిలోక మేలు దేవర దివ్యవదనంబు
కడు నెంగిలని యొరులుగందురో యనుచు.
గొప్పసవరంబు నాకొప్పులో ముడిచేవు
అప్పటి నాకు వెఱపయ్యీని
చెప్ప( గడు నరు దైనశ్రీవేంకటేశ యిది
యిప్పు డెవ్వతెకు నీ విత్తువోయనుచు. ॥ ౯౮ ॥

## పాడి

### పల్లవి

తోడెనే పుం డెరువ మందు నేరిచెనె
విడనితలంపు లివి వే(గీనె తాము.

### చరణములు

పతి( బాసి మేను తాపమైన నాయె(గాక
యితవైనయూరుపుల కేమి మూడెనె
సతతము నాహృదయజలజములో( బాయని
యతని నంటియు( దాప మందెనె తామును.
కినిసి కోరికలు వే(గినను వే(గె(గాక
తనివోనికన్ను లేల తమకించీనె
యెనలేని చూపులనెయెదుట( బ్రాణవిభుని(
గను(గొనుచు వగల( గందీనే తామును.
అరిది ముదములకు నక్కరయిన నాయె(గాక
పరవశముల కేమి బాధ వచ్చేనె

దిరువేంకటగిరిదేవుని కౌఁగిటఁ గూడి
బిరుసుగ మేను మఱపించీనె తాముసు. ॥ ౯౯ ॥

## ఆహిరి

### పల్లవి

ఆకాశపాకాశ మాయెఁ గోమలినడుము
వైకుంఠపతిపొందు వడిఁ దెలుపుకొఱకు.

### చరణములు

పరగఁ గెమ్మోవిపై పగలు చుక్కలు వొడిచె
పరివేషమ్మృగనాభిఁ బరగె మోము.
మరునిసమరమునఁ గోమలి విభునితోఁ జెనకు
సరసతల కిదియ సూచనచంద మాయె.
ఎలమి బొమ్మలజంకె లింద్రధనువులు వొడిచె
మొలచెఁ గన్నులఁగావి మొయిలు ఘనమై
కొలఁది కగ్గలపుఁగుంకుమచెమట నెత్తురులు
పొలఁతిపైఁ గురియుటకుఁ బోటివలె నాయె.
అంగనకునెడమతొడ అదరి భూకంపంబు
సంగతి వహించెఁ జంచలము లేక
ఇంగితంబుగ వెంకటేశుఁ గూడినపొందు
కొంగుబంగారమై కోరికలు మీఱె. ॥౧౦౦॥

## సామంతం

### పల్లవి

ఎటువంటి మోహమో యెట్టితమకమొ కాని
తటుకనను దేహ మంతయు మఱచెఁ జెలియ.

### చరణములు

పలుకుఁదేనెలఁ గొసరి పసిఁడికిన్నెర మీఁటి
పలుచనెలుఁగున నిన్నుఁ బాడి పాడి
కలికి కన్నీరు బంగారుపయ్యెద నొలుక
తలయూఁచి తనలోనె తలవంచుఁ జెలియ.

పడఁతి నీవునుఁ దాను పవళించుపరపుపై
పొడముపరితాపమునఁ బొరలి పొరలి
జడిగొన్న జవ్వాది జారుచెమటలఁ దోఁగి
యుడుకునూరుపుల నుసురుసురాయెఁ జెలియ.

తావిచల్లెడిమోము దమ్మి గడు వికసించె
లోవెలితినవ్వులను లోఁగి లోఁగి
శ్రీవేంకటేశ లక్ష్మీకాంత నినుఁ గలసి
యీవైభవము లందె నిదివో చెలియ. ॥ ౧౦౦ ॥

### కాంభోది

### పల్లవి

ఉప్పవడము గావయ్యా ఉయ్యాలమంచముమీఁద
గొప్పగొప్ప కన్నుల గోవిందరాజా.

### చరణములు

పవ్వళించే వీడ వచ్చి పాయనినీయలపెల్ల
మువ్వంకమేనితోడ ముచ్చట దీఱ
నవ్వేటి శ్రీసతిచూపు నాటినచిత్తపుమేన
క్రువ్వనికలువదండై గోవిందరాజా.

నిద్దిరించే వీడ వచ్చి నిలుచున్నయలపెల్ల
ప్రొద్దువొద్దునకుఁ దీర భోగీంద్రుపై
యిద్దరుసతులు నీకు నేచినతాళగతుల

గుద్దేటిపాదములతో గోవిందరాజా.
మెండుగ మేలుకొంటివి మించిన కౌఁగిటిలోన
కొండుకపాయపుసిరి కోపించంగా
ఉండవయ్యా సుఖలీల నుడివోని(ప్రియముతో
కొండలకోనేటిరాయ గోవిందరాజా. ॥ ౧౦౨ ॥

**తేకు-౫౯** **సామంతం**

**పల్లవి**

భ్రమయించే విట్టే పదిమారులు
నిమిష మేఁడాయె నీచేత నాకు.

**చరణములు**

పాఁతమడుగుగడ్డఁ బడి యీఁతకాఁడవు
లోఁతు చొరకురా లోఁగేవు
మూఁతులే గిరువంగ మోము నొచ్చీ నంత
బాఁతిమీఱఁ బకపక నవ్వకురా.
అలవిగాని మోహపు టాసకాఁడ నీ
వలుగకురా వెఱపయ్యీని
అలరి నీటఁ గొండలైనఁ దేలించేవు
లలనపైనె నీలా వింత వలెనా.
రచ్చరావికింద రంతులె చేసేవు
బచ్చనమాటల వసకాఁడ
రచ్చ చేసే వింక రాతిగుండెతోడ
మెచ్చుపుసాలపుల వేంకట విభుఁడా. ॥ ౧౦౩ ॥

## రామక్రియ

### పల్లవి

విచ్చేయవమ్మా వెన్నెలబొమ్మా
మచ్చికమరునిధాక మగువనీరాక

### చరణములు

పంచలపసిండినిగ్గు వచ్చిదేరే సిగ్గు
వంచనవలపుతీపు వాలుకచూపు
కంచపుంబాలకూడు కాఁకలనీవాడు
మంచపునీతలఁబ్రాలు మట్టెలపాదాలు.
కోవిలకొసరుఁబాట కొమ్మరో నీమాట
తావులచెంగావి నీతళుకుమోవి
గోవజవ్వాది కరంగు గుబ్బల నీమెఱుంగు
భావజుదాడిరొదలు పాదపునీకదలు.
ముద్దుల నీనగవు చిమ్ములరతిబిగువు
అద్దలింపుఁగసరు మోహంపుఁగొసరు
గద్దరినీయలపు వెంకటపతితలఁపు
అద్దపునీమోము మోహనరతిసాము. ॥ ౧౦౪ ॥

## సామంతం

### పల్లవి

మాట లాడనేరని రమణిఁబో నేను, నా
మాటలెల్లఁ బైఁడివంటిమాటలే గదె.

### చరణములు

పచ్చగందనిపడుచఁ బడఁతి నేను, నేఁ
డ(వ?) చ్చి వేసినట్టి వనితనె కదవె

లచ్చిగొండి నీవంటినెలఁతనా నేను, యింత
పెచ్చువెరిగే వదేమె పిన్నదానవా.
మిగులదళము గలమేఁటిఁబో నేను, నీ
దగునింటి ముంగిటి నిధానమంగదే
జగడాలగంప దింపుసతినా నేను, యింత
చిగురుఁగొమ్మ వదేమె చిన్నదానవా.
తలపూ వాడనితరుణినే నేను, నే
నలరుఁజవికలోనియాకనే కదే
కలికి వేంకటపతి కాంతనే(నే)నూ నేఁ
దొలియింతి నాకంటె దొడ్డదానవా. ॥ ౧౦౫ ॥

## సామంతం

### పల్లవి

పొద్దు వోయె నింక నేల బూమెలు, యింత
వద్దు నీకు సింగారాలు వచ్చేవా రావా,.

### చరణములు

పల్లవపుఁబరపుపై పవ్వళించు చెలిలాగు
తల్లడ మయ్యెడి నేము దలఁచినా
చొల్లెపుఁజుట్లే నీకుఁ జుట్టఁబట్టె నింతవడి
వల్లడివలపుకాఁడ వచ్చేవా రావా,
పొడలు వెట్టుచునున్న పొలఁతిభావము చెప్ప
తడఁబడె నాలిక తమకాన
కడుముత్యపుఁబేరులె కట్టఁబట్టె మెడనిండ
వడచల్లు చూపుకాఁడ వచ్చేవా రావా.
యింతి మేనివరితాప మింతేసి నే మెఱింగింప
పంతానికె విచ్చేసితి పైకొని

కంతునిగురుఁడ వేంకటరాయ యిటమీఁద
వంతఁబెట్టక యిట్టె వచ్చేవొరావొ. ॥ ౧౦౬ ॥

## శంకరాభరణం

### పల్లవి

సిగ్గున నీవలె నేఁ జెప్పుకొనఁ గాకా
దగ్గటి నాదేహ మంటి దాన్నైన నమ్మేవా.

### చరణములు

పాయ లేక నన్నుఁ బాసి పట్లువెట్టుకొంటినంటా
మాయలుసేసే వదేర మాఁటిమాఁటికి
యీయెడ నేఁ బట్టుతో నీయెదుటనె నిలుచున్న
చాయలమాట లనక చాల నీవు నమ్మేవా.
పట్ట లేక నన్నుఁ బాసి ప్రాణ మింతా బరవంటా
వొట్టుక నామీఁద నీవు వొలవేసేవు
గుట్టున నేవూరుపులు గుమ్మరించ నెఱుంగక
పట్టిననాప్రాణ మిదె పైపై నున్నదిరా.
ఇప్పుడు ననుఁ బాసి యిదె మేను చొక్కెనంటా
వొప్పుగ నామీఁదఁదెచ్చి వొళ్లువేసేవు
కప్పురా పచ్చడము వేంకటగిరీంద్రుఁడ నాకు
నప్పడె నీకంటెను లోనైతి నిదె చాలదా. ॥ ౧౦౭ ॥

## కొండమలహరి

### పల్లవి

మొల్లలేలె నాకు తన్నె ముడుచు కొమ్మనవె నేఁ
జెల్ల పూవు కొప్పుతావి చెంచుదానను.

## చరణములు

పట్టుచీ రేఁటికి నాకు పారిటాకులె చాలు
దట్టిగట్టుకొమ్మనవే తనమొలనే
పట్టెమంచ మేలె నాకు పవ్వళించు మనవె నేఁ
జెట్టుకిందఁ బొరలాడే చెంచుదానను
సందిదండ లేలె నాకు సంకుఁగడియమె చాలు
యిందవే యెవ్వతెకైన నిమ్మనవె
గందమేలె నాకు చక్కని తనకే కాక నేఁ
జిందువందు చెమట మై చెంచుదానను.
కుచ్చుముత్యా లేలె నాకు గురివిందలె చాలు
కుచ్చి తనమెడఁ గట్టి కొమ్మనవె
కచ్చుపెట్టి కూడె వేంకటగిరీంద్రుఁడు నను
చిచ్చినే నడవిలో చెంచుదాననూ. ॥ ౧౦౮ ॥

**రేకు-౬౦** **పాడి**

## పల్లవి

పిల్లఁ గ్రోవి పట్టుమంటాఁ బెరరేఁచీని మా
గొల్లవారి పిల్లఁగోవి కోరో చల్లా

## చరణములు

పాడుమంటా దండెమీఁటేఁ బలుమారునుం దా
వేడుక నెవ్వతెపాట వినవచ్చెనో
వాడలోఁ జల్లలమ్మే వనిత నింతే శ్రుతి
గూడి నేఁ బాడేటిచల్ల కోరో చల్లా.
చేరి నన్ను నాడుమంటాఁ జెక్కు నొక్కీని తా
గారవాన నెవ్వతాట గనివచ్చెనో,

మారుకు మారాడేటి మందవారము మేము
కోరికి నాడేటిచల్ల కోరో చల్లా.
కిన్నెర మీఁటుమంటాఁ గెలసీని తన్నుఁ
గిన్నెర మీట్ల నేది గిలిగించెనో
కన్నుల కలికి వేంకటపతిపై వెట్టి
గొన్న కిన్నెరగుబ్బల కోరో చల్లా. ॥ ౧౦౯ ॥

## సామంతం

### పల్లవి

వింత వింత వింతలూ, నీ
చింతలే పో చిగిరింతలూ,

### చరణములు

పోపో పోపో విడవోయీ నీ
చూపు మాపైఁ జూఁడించకా,
రేపేపో రేసులెల్లా నీ
తీపేపో తీదీపులూ,
చాలుఁ జాలుఁ జాలుఁ బోవోయీ, నీ
జాలి మాపైఁ జల్లించకా,
రేలేపో రిచ్చలెల్లా నీ
మేలే మేలే పో మెరమెరలూ.
రాఁపు రాఁపు రాఁపు లేలోయీ నీవు
మాపుదాఁకా మాతోడనే
యేఁపకు వేంకటేశ నన్ను నీ
కాపురమే పో కరఁగింతలూ. ॥ ౧౧౦ ॥

## నాదనామక్రియ

### పల్లవి

చెల్లెఁగా నీవు సేసినచేఁ ౹లు నీవు
వొల్లకే విభునింతవాడలు నేఁచితివి.

### చరణములు

పొడవుఁ జందురుఁడు నొప్పులు సేయువిరహ ౹లను
పెడమొకముచేసి నొప్పించేవు
కడుఁ బలికి కీరములు కారించు విరహులను
పడఁతి పగఁబెట్టితివి పలుకకే విభుని.
తొలుమెఱుపు మెఱిచి పొంధుల నొంచు నీ వెదుట
పొలయకే నొంచితివి పొలఁతి యతని
బలుపువెన్నెల భంగపఱచు విరహుల నింత
నలఁగించితివి నీవు నవ్వకే విభుని.
పన్నీరు విరహులను బరవశముసేయు నీ
మన్ననఁ గౌఁగిటఁ జేర్చి మరపించితి
కన్నియరో నీవు వేంకటవిభుని కౌఁగిటను
ఇన్నిటను గడుమించి తేమి చెప్పెడిదే. ॥ ౧౧౧ ॥

## శంకరాభరణం

### పల్లవి

ఓయమ్మ వెరపించె నొకభూతమూ
రోయక యిన్నిటనుం దిరుగు భూతమూ

### చరణములు

పదిశిరసులపెద్ద బమ్మరాకాసునిని
జెదరనీక యడిచిన భూతమూ
మదమున బాలెంత మగువ నెత్తురు పిన్న

పెదవిఁ బీలిచెఁ బెనుభూతమూ.
వేయిచేతులపెద్ద వెడగుదానవునిఁ
జేయి చాఁచి యడిచిన భూతమూ
రాయడింపుచు బెద్దదంటరక్కసుని
బాయం జీరిన బలు భూతమూ
పడుచుఁ బట్టుక వేఁచే పసిఁడిదైత్యునిని
కడుపు చించిన ఘనభూతమూ
అడరి శ్రీతిరువేంకటాద్రిమీఁద నుండి
పొడచూపె నదివో పెంపుడు భూతమూ. ॥ ౧౧౨ ॥

## శ్రీరాగం

### పల్లవి

జాణతనా లాడే వేలే జంపుగొల్లెతా వోరి
ఆణిముత్యముల చల్ల లవి నీకుఁ గొల్లలా

### చరణములు

పోయవే కొసరుఁజల్ల బొంకుగొల్లెతా, వోరి
మాయింటి చ ల్లేల నీకు మన సయ్యారా
మూయకువే చల్ల చాడిముచ్చు గొల్లెతా వోరి
పోయవా పోవా మాచల్ల పులు సేల నీకును
చిలుకవే గోరం జల్ల జిడ్డుగొల్లెతా వోరి
పలచని చల్ల నీకు బాఁతిగాదురా
కలఁచవే లోనిచల్ల గబ్బిగొల్లెతా వోరి
తొలరా మా చ ల్లేల దొరవైతి నీకు.
అమ్మకువే చల్లలు వొయ్యారిగొల్లెతా వోరి
క్రమ్మర మాతోడ నిట్టే గయ్యాళించేవు

సొమ్మొలం బోయే వేలే సొంపుగాల్లైతా నోరి
దిమ్మరి కోనేటిరాయ తిరమైతె ఎను. ॥ ౧౧౩ ॥

## సామంతం

### పల్లవి

అందుకే వెఱచేనో యమ్మలాలా తన
కందువకే పారంబోయి కాలుజారె బిడ్డండు

### చరణములు

పాలకడవలును బానలవెన్నలును
ఓలిం బెట్టి వుట్లపై నుండంగాను
నేలనుండి యెగసి నిక్కితీసె నిదివో
పాలు గాసుసేయ విడి పడఁబోయె బిడ్డఁడు.

కమ్మని నేతులును గడ్డలజున్నులును
కమ్మి వెద్దకాఁగులతో కాఁగంగాను
దిమ్మరియై తొడికి తియ్యం బోయీ నిదివో
అమ్మరో వ్రేళ్లు పొక్కి అగ్గిదాఁకి బిడ్డఁడు.

కోడెలఁ బేయలను కూడఁగట్టి విడిచి
వోడక వీధులం బరువులు దోలీని
వేడుక కాఁ డిదెవో వేంకటేశ్వరుఁడు
ఆడకు నీడకుఁ బాఱి అలసీని బిడ్డఁడు. ॥ ౧౧౪ ॥

**రేకు-౬౧** మలహరి

### పల్లవి

ఆయలేరే యేమి చెప్పి రాతనిసుద్దులు నాకూ
తాయిమక్కళాలె కాక దయగద్దా తనకు.

★ " అందుకే వెఱచెవో" - అను 114వ కీర్తన పూర్వప్రతులలో గొన్నింటియందు-117 కీర్తనగా పునరుక్తముగావింప బడినది కాన యిందు ఆ పునరుక్తము గావింపబడుట పరిహరింపబడినది

### చరణములు

కన్నులఁ జూడనె పట్టె కాఁకలు సేయనె పట్టె
ఇన్నిటా తా నన్నుఁ గూడే దెప్పుడో కాని
సన్నలు సేయనే పట్టె చవులు చూపనే పట్టె
వెన్నెలబాయిటికి రా వేళ లేదు తనకు.
నవ్వులు నవ్వనే పట్టె నాలిసేయనే పట్టె
ఇవ్వల నన్నుం గూడేది యెన్నఁడే తాను
పువ్వుల వేయనే పట్టె బుజ్జగించనే పట్టె
పవ్వళించం బ్రొద్దులేదు పను లేలే తనకు.
మాటలాడనే పట్టె మనసు చూడనే పట్టె
ఈటునం గాలు దొక్కేది యెన్నఁడే తాను
పాటించి శ్రీవెంకటాద్రిపతి నన్ను నురముపై
తేటలుగా నెక్కించుక దించ నెడలేదు. ॥ ౧౧౫ ॥

### ముఖారి

### పల్లవి

పట్ట రైరిగా మిమ్ముఁ బడఁతులు వద్దనుండి
ఒ(వ?)ట్టిచే ముట్టి సరసా లొ(లువ?)ద్దంటిఁగా

### చరణములు

పువ్వులచెండున వేసి పుప్పొడి వాటులం బడి
నొవ్విఁ బడే వేలే కన్నులఁ దిట్టు తా
అవ్వలివ్వలిమోములై అలిగితి రిద్దఱు
నవ్విన నవ్వి జగడాలు నడుమనే వచ్చెఁగా.
చిలుకవే గోరం జల్ల జిడ్డుగొల్లైతా వోరి
పలచని చల్ల నీకు బాఁతిగాదురా

కలఁచవే లోనిచల్ల గబ్బిగొల్లెతా వోరి
తొలరా మా చల్లేల దొరవైతి నీకు.
అమ్మకునే చల్లలు వొయ్యారిగొల్లెతా వోరి
క్రమ్మర మాతోడ నిట్టే గయ్యాళించేవు
సొమ్మెలం బోయే వేలే సొంపుగొల్లెతా వోరి
దిమ్మరి కోనేటిరాయ తిరమైతి నీకును. ॥ ౧౧౬ ॥

**రేకు ३౨** **రామక్రియ**

**పల్లవి**

తానే చూడవే యీతండు నన్ను
పోనీ పోనీ పోనీ ననీనే

**చరణములు**

చల్ల లమ్మనీఁడే సారెకు నాపైఁ
జల్లీఁ జల్లి చక్కఁదనమే
నల్లని జాణుండు వీఁడే నే
నొల్ల నొల్ల నొల్ల నోయమ్మా!
పువ్వుల నిప్పుడు వేసేని నాతో
నవ్వి నవ్వి నక్కుం జూపుల
దవ్వుల నీతండు చూడవే నే
నవ్వా నవ్వా నవ్వా నోయమ్మా!
ఇంకా నలమీ నీతండు నాతోఁ
గొంకీ కొంకి కోరికల
వేంకటేశుం డరవిరియై నేఁ
బొంకా బొంకా బొంకా నోయమ్మా! ॥ ౧౧౭ ॥

★ 113 వ కీర్తనయందలి 3, 4, చరణములు, 116 కీర్తనయందలి 3, 4 చరణములుగా పునరుక్తములై యున్నవి

## ఆహిరి

### పల్లవి

చక్కని బోయ జవరాలు మించు
చెక్కుపై చేతితో చెలి దూరే నిపుడు.

### చరణములు

చింతచిగురుదెచ్చి చెలువైన వలపుల
సంతనమ్మిన బోయ జవరాలు
కంతుగురుఁడ నిన్నుఁగలయంగఁ దలపోసి
చింతచిగురుచేతఁ జిమిడే నిపుడు
కిన్నర కులుకుల కెరలి జారెడి గుబ్బ
చన్ను మూయదు బోయ జవరాలు
వెన్నుఁడ నినుఁ బాసి వెడమాయ కోవిల
కున్నల కులుకులు గులికే నిపుడు.
వల్లెవాట్లతోడ వడిఁ బెద్దకన్నుల
చల్లుఁ జూపులబోయజవరాలు
నల్లని తిరుమల నాయని కౌఁగిట
చల్లని చూపుల జంకించె నిపుడు ॥ ౧౧౮ ॥

## ముఖారి

### పల్లవి

ఏమి సేయఁ గలమయ్య యేలికయ్య
సోముని కళల మోము చూడకుంటేఁ జూడవు

### చరణములు

చెలి చక్కనిది గాదో చిత్త మేమి రాదో
కొలఁది మీఱిన నీపై కూరిమి ఏదో

ఎల జవ్వనము కొల్ల లీడో వాడో
ఒలసీనొల్లముల నీ వొల్లకుంటే నొల్లవు.
మరుఁ డేమి మతిలేఁడో మఱచి వున్నాఁడో
గరిమలవిలుకాఁడు గాఁడో లేఁడో
దొరకుం జెఱకువిల్లు తూఁడో యేఁడో
సిరుల నీచిత్త మిది చేరకుంటేఁ జేరదు
మ్రొక్కనిదే చలమో మోహ మేమి ఖిలమో
పక్కం బాసినందు కేమిఫలమో
యెక్కువ వేంకటరాయ యేతులేని పాలమో
మిక్కిలైతి విందాఁక మెచ్చకుంటే మెచ్చవు. ॥ ౧౧౯ ॥

## శంకరాభరణం

### పల్లవి

తమ్మిం దమ్మిం దాఁకె తపియించంగా
అమ్మలే యమ్ములఁ దాఁకె నంతలోనె

### చరణములు

చందురుం జందురు నేఁచె జాలికి జాలివుట్టె
మందమారుతము సోఁకె మందమాయే గాలి
తీఁగె సోఁకి తీఁగ వాడె తేనె దాఁకి తేనె చిందె
చేఁగ చిగురునం గాఁగె చెంగావి చిగురు.
వేంకటేశ్వరునిమీఁద వేంకటేశ్వరుండు వచ్చె
సంకె మీఁద సంకె దేరె సకియభాగ్యమే. ॥ ౧౨౦ ॥

## ఆహిరి

### పల్లవి

బడలివున్నాఁడు ఉప్పరిగలోన గుట్టు
విడిచి విభునిం జేర వచ్చేయవె.

### చరణములు

చిలుకు నీనగవులే చిలుపాలు నీ
పలుచని నీతెలిచూపుం బాశాలు
చలివేఁడికసరులే శాకాలు యింపు
దొలఁచి నీపతికి విందులు వెట్టవే.

జడియు నీ చెమటలే జలకాలు నీ
కడుమంచి మెయితావి గందాలు
వెడయూర్పు విసరులే విభవాలు నీ
పొడముఁ బలుకులతప్పులు వాపవే.

కమ్మని నీమాటలే కప్పురాలు నీ
తమ్ములపుంజెదరులే తలఁబ్రాలు
నెమ్మది వేంకటగిరినిలయుని నీవు
క్రమ్మఱం గ్రమ్మర నిట్టే కౌఁగిలించవే ॥ ౧౨౧ ॥

### శ్రీరాగం

### పల్లవి

పాయపు మీమీ ఫలమూ, యీ
కాయపు సుఖములు గైకొనవద్దా

### చరణములు

చింతమోముతోడఁ జెక్కునం జేతితో
నెంతైనం బొదల విదే మమ్మా
అంతటి రమణుం డబ్బె ననుచు నీ
చెంతనే కౌఁగిటం జేకొనవద్దా!

విసుగుమోముతో వెరగులాగుతో
నిసుమంతనవ్వ వేమమ్మా!

కస రేమి లేక కౌఁగిట నీవిట్టే
ఒసపరిరీతి నుండంగ వద్దా
అరవిరిరీతి నబ్బురపుమేన
నెరవై వుండే విదేమమ్మా!
తిరువేంకటేశుం దెగఁగొంటివిట్టే
ఉరముపై దిగ కుండంగవద్దా ॥ ౧౨౨ ॥

## శ్రీరాగం

### పల్లవి

కౌఁగిట నిన్నుం గలయం గలవాఁడు విరహాన
వేఁగక యెట్లానుండు వినవే తరుణి

### చరణములు

చిత్తజానలముచేతఁ జిట్లె గందపుఁబూఁత
మెత్తనితనువుమీఁద మెఱయంగా
ఒత్తిలి యొకతెమీఁద నొరగి పలుకవు నీ
చిత్త మిప్పు డెందువోయెఁ జెప్పవే తరుణి!
తొంగలి రెప్పలలోని తొలుకరి మెఱుఁగులు
చెంగలించి నలువంకఁ జెదరంగాను
బంగారు పతిమవంటి పడఁతి నీమైఁదీఁగ
ముంగిట వేయక యిట్టె ముయ్యవే తరుణి
వీడినది మొలనూలు విరులు చెదరెం గొంత
వాడినది కెమ్మోవి వన్నెలై
కూడితివి చెలి నీవు కోనేటిరాయనిపొందు
ఈడఁ గొత్తలాయ నేఁటికే పోతరుణి! ॥ ౧౨౩ ॥

రేకు-33 హిజ్జిజి

పల్లవి

ఇయ్యింతిమురిపెము యెట్లుండెనే
ఒయ్యారముతో నొరపోలికనో యనఁగా

చరణములు

చక్కనిరమణిగుబ్బచనుదోయి కడు నిండి
యెక్కువమదనరేఖ లెట్లుండెనే
అక్కరతో సతి హృదయమున వలపు విత్త
దుక్కిగా మరుఁడు గోళ్ళ దున్నించె ననఁగా

లలనకుంబులక మొలకలపైఁ జెమటలు
ఎలనవ్వుం జెక్కులపై నెట్లుండెనే
వలపను నునుంబైరు వాడకుండా మదనుండు
నెలవుగాఁ బైపైనె నీరు నించె ననంగా

అందపు నెఱులలోన నలరురేకులు జాఱి
యిందువదనకుం దురు మెట్లుండెనే
కందువ వెంకటపతి కౌఁగిటి పరవశాన
వందులేక పండి కైవ్రాలెనో యనంగా ॥ ౧౨౪ ॥

ఆహిరి

పల్లవి

ఇందవయ్య మీసొమ్ము లేల మాకు
క్రిందుపడి యెవ్వతె యెంగిలి నేల నన్నదో

చరణములు

చెట్ట వట్టి తియ్యంగానే చేయి దీసుకొనేవు
ఒట్టు వెట్టుకొని నన్ను నొల్లనంటాను

రట్టుగ నాముద్దుటుంగరము నీచేఁ జిక్కె నిదే
పెట్టుకో యెవ్వతెవ్రేలం బెట్టి వేసారినదో
పాదమువట్టుకొనంగానే పలుకవైతివి నాతో
ఆదరించంబడేనంటా అలుకతోడ
పేదవారము మాకాల పెండెముచిక్కెనిదె వో
ఏదెస నెవ్వతెకాలిదెరవుదెచ్చినదో
కోపగించుకొన్న నాకుం గొమ్మనుచుం గంటమాల
మేపెటితీవ్వులచేత మెడంబెట్టేవు
ఏపలరఁదిరువేంకటేశ నాతోనిటువలె
నీపనికిం జే సేసితి వింక నేమిసేతువో || ౧౨౫ ||

## భూపాళం

### పల్లవి

సుదతితో నిం తేలని చూపి చెప్పరమ్మా
ఎదురెదురే చూచీ నెటువంటివలపో

### చరణములు

చెక్కుమీఁది చెయ్యి దీయఁ జెప్పరమ్మా దీని,
చిక్కనిగుబ్బలు మూయఁ జెప్పరమ్మా!
చిక్కునెఱులు ముడువఁ జెప్పరమ్మా దేహ
మెక్కడో త నెఱుఁగదు యెటువంటి వలపో
చిత్త మేమిటికి వేఁచీఁ జెప్పరమ్మా యీ
చిత్తజుచే నేల నొచ్చీఁ జెప్పరమ్మా!
చిత్తణివిద్యలు మానఁ జెప్పరమ్మా శిర
సెత్తి యెవ్వరిని జూడఁ డెటువంటివలపో
చిదుగాయ సిగ్గు లెల్లాఁ జెప్పరమ్మా వొళ్ల

చిదిమి నా నెఱుంగదు చెప్పరమ్మా
చెదరెడిఁ దమకము చెప్పరమ్మా యిప్పు
డిదె వేంకటేశుఁ గూడె నెటువంటివలపో ॥ ౧౨౬ ॥

## ఆహిరి

### పల్లవి

లంపుగుబ్బ గొల్లెతల లంజకాఁడ నీ
యింపులే వెదకంబట్టీ నెట్లరా వోరి!

### చరణములు

చెప్పరానివేడుకల సిగ్గులనే నిన్నాళ్లు
ఉప్పతిల్లుం గోరికల నుంటిం గాని
ఇప్పు డింతనిలువలే నేమిసేతు నీచిత్త
మెప్పుడు గాని రాదో యెట్లరా వోరి
చిల్లర సింగారాలు చెలులు సేయఁగ నేను
వొల్లనని యిన్నాళ్లు నుంటిం గాని
మల్లెపూవువంటినన్ను మాసినచీరతోడ
నిల్లు వెళ్లకుండఁ జేసి తెట్లరా వోరి!
కమ్మనిపానుపున నీకౌఁగిటిలో నిన్నాళ్లు
ఉమ్మగింపుమేనితో నుంటిం గాని
దిమ్మరిసేఁతలతోడి తిరువేంకటేశ! నీ
యెమ్మె లింకా మానలే వెట్లరా వోరి. ॥ ౧౨౭ ॥

## శ్రీరాగం

### పల్లవి

ఎఱుంగుదు మిదే నీయేతు లెల్లా
తెఱవల నిటు దినదినము నేఁచేవు

## చరణములు

చూపులనే తనిపేవు సొలపు లాడేవు
తీపులం గ్రిందుపడేవు తేలించేవు
ఆపనికి బెట్టుగా న న్నదలించేవు
మాపటి చేఁతలకే మచ్చిక చల్లేవు

అడుగరాని దడిగే వాసలు సేసేవు
మడుగులు గలంచేటిమాట లాడేవు
అదరి రాయి గరంగ నలపు చూపేవు
వడి నందనిపనికి వలపు చల్లేవు

చీర వెలిగా నవ్వేవు సిగ్గు విడిచేవు
మోర నిడుపు చేసుక మూఁతులు నాఁకేవు
చేరి చెఱంగు వట్టేవు శ్రీవేంకటేశుండా
సారెకు నిట్టే కూడేవు చనువు లిచ్చేవు ॥ ౧౨౮ ॥

## శ్రీరాగం

## పల్లవి

రాను మీకడకు వోరమణులార పూవుం
బానుపు హరికి నేఁ బఱవవలయు నేఁడు

## చరణములు

చెలఁగి దేవుండు నేఁడు సిరితో నేఁటికి నో
పొలయలుకలవలపులు నటించి
తలఁపోఁత విరహవేదనల నున్నాఁడు ఈ.
చలిమందు లతనికి చాఁతవలయు నేఁడు.

రమణుం డిప్పుడు ఇందిరాదేవియెదుటను
తమకించి యెవ్వతెనో తలంచెనట

కమల గోపింపం గా(కల నారగింపండు ఈ
హిమజల మతనికి నీయవలయు నే(డు.
వెల(ది( బాసి తిరువేంకటేశ్వరుడు
కలికియై కౌ(గిట( గలసెనట
తిలకము గర(గేటి తిరుమేనిచమట యీ
వెలినుండి పలుమారు విసరవలయు నే(డు. ॥ ౧౨౯ ॥

**రేకు-౩౪** **శ్రీరాగం**

**పల్లవి**

ఏటితమకమే నా కింకను విని
సాటకములు బడి నమ్మిన వెనక

**చరణములు**

చెల్ల(బో యేలే నాచెలువము వీని
వొల్లనిమేనితో నుడుకుచును
వెల్లాయ మేలే నావిభవము వీని
చల్ల(గౌ(గిలి జడిసిన వెనుక.
పొలి(తి నా కేలే యీపొందులు వీని
అలయింతవలపుల నలయుచును
చెలియ నా కేలే యీసిరులు వీని
తల( పంతకా(కలం దగిలిన వెనుక.
కదిసి నా కేలే యీగరువము వీని
పొదలుంబరవశాన( బొరలుచును
ఇదివో శ్రీవేంకటేశుండు వీని
యుదుటుంగూటముల నే నోసరినవెనుక. ॥ ౧౩౦ ॥

## భైరవి

### పల్లవి

అంత నంతం దమకాన నలసేవు మా
వింతగాని పొందు నీకు వేఁగాయఁగా

### చరణములు

చాయలకే మొక్కేవు సన్నలకే చిక్కేవు
మాయిల్లు నీకింత మఱపాయఁగా
పోయినరాతిరి నిన్నుం బోకు మంటాఁ బలుమారు
చేయివట్టి పెనంగుట చేఁ దాయంగా.
మచ్చరాన మలసేవు మాటలనే సొలసేవు
వెచ్చందనమే నీకు వేఁగాయంగా
వచ్చివచ్చి నిలిచేవు వాడికలు సేసేవు
తచ్చన ప్రేమము నీకుం దగవాయంగా
మంచి విడె మిచ్చేవు మనసెల్లాఁ దచ్చేవు
వంచనలే కిట్టయినా వచ్చేవుగా
ఎంచరానితిరువేంకటేశ నన్నుం గూడితివి
పొంచిపొంచి కానికగాఁ బొందితివిగా. ॥ ౧౩౧ ॥

## శంకరాభరణము

### పల్లవి

నేర్చితి నీవును నెయ్యము లూఁని
తేర్చినతేటలు తెలియవుగా

### చరణములు

చదివితి నీవును సాందీపు(ప)నితో
వెదకే వెదకమును వేదములు

పెదవులు గదలియుం గదలని
మదనునిచదువులు నాఁడవి చదువవుగా.
కరచితి నీవును కౌశికమునిచే
నెఱి నాయుధముల నేరుపులు
గుఱుతులు సోకిన గుబ్బున సారిగెటి
వొఱపులకై దువు లొల్లవుగా.
తడిసితి నీవును దగుజలనిధిలో
నడరుచు మీనమ వై నాఁడు
కడుఁజెమటల వేంకటపతి నారతిం
దడిసినట్ల మును దడియవుగా. ॥ ౧౩౨ ।

## కాంభోది

### పల్లవి

చెలియమోహము చూడరమ్మా
చెలియమోహము నేఁడు చెలుల కగ్గలమాయ

### చరణములు

చిత్త మాతనిమీఁద చేయి చెలియమీఁద
కొత్తైన గమనంబు కొనవేళ్ల మీఁద
తత్తరపుఁదాపంబు తనువల్లిమీఁద
బిత్తరపుఁగోపంబు ప్రియసతులమీఁద.
అలపులునుసొలపులును అంగజునిమీఁద
తలపంత యెడలేక దైవంబుమీఁద
పలుకులును బంతములు ప్రాణంబుమీఁద
తెలుపులును తెగువలును దీమసముమీఁద.
ఇంపుసొంపులు వేంకటేశ్వరునిమీఁద
గుంపైన చందురులు కుచయుగముమీఁద

కెంపు ( గనుగవచూపు గిలిగింత మీ(ద
దంపతులపరిణతులుతమకంబుమీ(ద. ॥ ౧౩౩ ॥

## పాడి

### పల్లవి

చింతచే( జిత్తంబు చిక్కువడిన ట్లాయ
కాంతక్రొవ్విరుల సింగారంపు( దురుము

### చరణములు

చెలినుదుట మరు(డు వ్రాసిన వ్రా(తవలె నాయ
సొలపునను జెదరుంగస్తూరి పట్టు
జలజలోచనగుండె జల్లనిన యట్లాయ
పులకజొంపముల మెఱుపులచన్నుదోయి.
వనితవలపులజలధి వడి మును(గినట్లాయ
కొన మిగిలి జారుచెక్కుల చెమటలు
మనసిజాగ్నులపొగలు మతి నెగసిన ట్లాయ
తనివోని నిట్టూర్పు తాపంబు గాలి.
కాంతపరిణత(తు?)లు లెక్కలు వెట్టినట్లాయ
కంతు నునురేఖ లంగనమేనను
అంతరంగమున విభు(డలముకొనిన ట్లాయ
సంతసపు వేంకటేశ్వరుపొందు చెలికి. ॥ ౧౩౪ ॥

## సామంతం

### పల్లవి

పులకజొంపములె పో పుంఖానుపుంఖముల
తెలుపులును మఱపులును దెచ్చె( గోమలికి.

### చరణములు

చేటెఱుంగనికూన చెలి చిత్తమే కదా
కోటికిని బడ గెత్తెఁ గోరికలను
తేటైన తమకములు దీనిపొందుననెపో
పోటుఁబాటునుజేసెఁ బొలిఁతికన్నీరు.
కలి మెఱుంగనివిందు కాంతవయసే కదా
కలశంబు లెత్తెఁ దమకపుమేడకు
తెలిఁగన్నుఁగవచూపు దీనిచేఁతలనెపో
తలవాకిటికిఁ దెచ్చెఁ దరుణిప్రాణములు.
తనివెఱుంగనియాన తరుణివేడుక గదా.
నినుపులై రతులు పెన్నిధు లాయెను
వినుతింప నిదియపో వెంకటేశ్వరుఁ దెచ్చి
ఘనపరవశము తరంగములు గావించె. ॥ ౧౩౫ ॥

**రేకు-౩౫** **సామంతం**

### పల్లవి

తొయ్యలి కొప్పున సేవంతులు నించే విట్లనె
నెయ్యపు మెల్ల నీకొప్పైనె నించరాదా

### చరణములు

చెలిశిరసు నెఱులు చిక్కు వుచ్చే విట్లనె
బలుపుంజిత్తము చిక్కు వాప రాదా
కులుకుచుం దరుణిచెక్కులు నొక్కి తిట్లనె
నులిచి నీవే యాస నొక్కరాదా?
సుదతికి నొసలం గస్తూరి మెత్తే విట్లనె
మృదువుమైఁ జలు విట్లే మెత్తరాదా

కుదురుగుబ్బలమీద గోర నంటే విటనె
అదనంగౌఁగిట నిట్టేయంటరాదా?
పడఁతిపై నొరపుగం బపళించే విట్లనె
ఒడలిపై నాకెనిట్లే యుంచరాదా
తడసి వేంకటరాయ తమకించే విట్లనె
కడు దీనిప్రేమ మిట్టే కానరాదా? ॥ ౧౩౬॥

## ఆహిరి

### పల్లవి

వావి గాదు నీకు నాకు వద్దు వద్దు నీ
తోవరా వెఱుతు మన్నా దోసాలు గట్టకురా

### చరణములు

చక్కనివాఁడ ననుచు సారెసారె నీవు వోరి
లెక్కలేని నొయ్యారములే చల్లేవు
తక్కుల మొన్న నామఱందలితోడ నీవు వోరి
తొక్కులాడితివి చాలు దోసాలు గట్టకురా
చూడకురా నావంక సోయగపునీవు యీ
వేడుకచిఱునగవే వెదచల్లేవు
కూడితి నాచెలిమి మక్కువ నిన్న నీవు వోరి
తోడనే యింతేసి నాకు దోసాలు గట్టకురా
రాఁగినది నీచిత్తము రంతుకాఁడ నీవు వోరి
మాఁగిననామనసుపై మచ్చు చల్లేవూ
కౌఁగిలించి నన్ను వెంకటరాయ నీవు వోరి
తూఁగు మంచానకుం దీసి దోసాలు గట్టకురా! ॥ ౧౩౭ ॥

## శంకరాభరణం

### పల్లవి

చతురుం డని నాసరసతలూ
ఇతరము లైనవి యేమి సేతురా

### చరణములు

చెనకుచు నీవు నాకు సేసినమేలు
పెనఁగొని మతిలోఁ బెరిగేని
మనసు తమకమై మదనతాపమయి
యెనలేనివిభుఁడ యేమి సేతురా.
కదలు నీమురిపపుంగన్నుల నగవు
పొదలుచు నామతిఁ బొలసీని
చెదరని యలపై చింతారతియై
హృదయము రేఁచి నేమిసేతురా.
ఇపు డిటు నీవు నా కిచ్చినచనవు
అపరిమితములై యలరీని
విపులవిభవమై వెంకటేశ! నా
కెపుడు బాయ దిదే యేమి సేతురా. ॥ ౧౩౮ ॥

## ముఖారి

### పల్లవి

అరిది చేఁదుం దీపై నంతకంటేనా
సరిలేని విభుతోడఁ జయ్యాటమాడేవు

### చరణములు

చలమునం బగవారు సైతము నొకవేళ
పలుక చేరే రట యంతకంటేనా

పొలయలుకలు దీరి పురుషుఁ డిప్పుడు నిన్నుఁ
బిలువఁ బంపినయంత బిగు వేలే నీకు.
తప్పులు సేసినవారి దయసేసి రాజైన
అప్పుడే మచ్చికం గూడీ నంతకంటేనా?
తిప్పిన మొకముతోడి ధీరుండు విభుండు నీకు
గప్పురపువిడె మియ్యంగఁ గడకంటఁజూడవు.
యెడసి యెదిరిం దము నెఱుంగక పైకొన్న
నడవిమెకాలు గూడీ నంతకంటేనా?
కడు నొవ్వ నాడి వెంకటవిభునికి నీవే
వెడమోము కూటముల వెఱపించుకొనేవు. ॥ ౧౩౯ ॥

## వరాళి

### పల్లవి

కలిగెంగా నేఁడు కాంతకు లోని
వలవంత సొలపులే వరునిసన్నుతులు.

### చరణములు

చెలువపు విభునిఁ జూచిన కన్నులకును
మలయు లేఁగురులే చామరతతులు
కలికిరమణునిఁ బొగడిననోరికిని
అలము నిట్టూర్పులే ఆలవట్టములు.
సిరులందు విభుని డాఁచిన తలంపునకు
అరిది తలంపులే పాయనిపూజలు
పరువంపుఁబతి నాసపడిన గుబ్బలకు
అరవిరి చెమటలే అభిషేకములు.
వెంకటపతితో నవ్విన నవ్వులకును
అంకెలమోవి తియ్యని బోనము

జంకించి యితనిపైఁ జూఁచు బొమ్మలకు
బింకపు నటనలే ప్రియములగములు. ॥ ౧౪౦ ॥

## ఆహిరి

### పల్లవి

కాఁగె నిట్టూర్పులై గాలి మారుకుమారు
ఈఁగి చేసినదైవ మెఱుఁగఁడాచేఁత.

### చరణములు

చెలికి విరహాగ్ని రేఁచినఫలము చెదరఁగా
ఎలఁదేఁటు లలకలై యెదు రెదురనె
పొలఁతికోవిలలు నటువలెనెపో లలితాంగి
పలుకులై సన్నగిలెం బాయునా చేఁత.
చెంది వెన్నెలల వేఁచినఫలము బడలెఁగా
చందురుఁడు వదనమై సతి కిచటనె
అందంద కలువలకు నట్లఁబో కలువలై
పొం దెడలి యరమొగిచెఁ బో నాచేఁత.
పడతివేఁచిన ఫలము పన్నీరు నుడికెఁగా
ఉడికేటి చెమటలై యొడలిమీఁద
అడరి యంతట వేంకటాధిపుని కౌఁగిటనె
తొడరి యిన్నియు దీర్చె దొరకెఁగా చేఁత. ॥ ౧౪౧ ॥

రేకు -౩౬ ముఖారి - ఆటతాళం

### పల్లవి

కన్నులతుదలం గెంపు గానరాఁగాను నీకు
నన్నువ యలుకలు వేఱాయ నొసవితిమి.

### చరణములు

చేరి నీగుబ్బలమీఁది చెమటముత్యము లోలి
తోరపు ముత్యాలసందుల నుండంగా
కూరిమి నీపతి రతిఁ గూడిన నిబ్బరమున
హారములు చెదరి యే మాయ నొసవితిమి.

పెట్టిన కస్తూరిబొట్టు బెరసి నీకురులతో
నట్టు నిట్టుం జిందు వందు రై యుండంగా
మెట్టుకొని చందురుని మింటిమీఁది రాహు వచ్చి
పట్టపగలె యెలమిం బట్టె నొసవితిమి.

ముదిత నీకరమూలములను వేంకటపతి
ఉదుటుంజేఁతలు నిండి ఉండంగాను
పొదలు మొగ్గలతోడి పూలతీగెలతావి
వెదచల్లుచును విట్టువీఁగె నొసవితిమి. ॥ ౧౪౨ ॥

## శ్రీరాగం

### పల్లవి

అతనుని సరకులే యంగడివి
అతివలె కడు నీ కమ్మెద రదివో.

### చరణములు

చక్కందనములు జవ్వనమదములు
చెక్కులనగవులు సిగ్గులును
మొక్కులచూపులు మురిపంబులు నీ
యక్కఱ దీరఁగ నమ్మెద రదివో.

గుబ్బలమించులు కొప్పుల చెదరులు
సిబ్బెపు మేనుల చెమటలును

గబ్బితనంబులు గసరుల జంకెలు
అబ్బురముగ నీ కమ్మెద రదివో.
తలపోఁతలు చింతాపరవశములు
వలచి వెంకటేశ్వర నీకు
కల వీ యంగడిఁ గదియకు నన్నిటు
లలసితి విదె నీ కమ్మెద రదివో. ॥ ౧౪౩ ॥

### కాంబోది

### పల్లవి

మొత్తకురే యమ్మలాల ముద్దులాఁడు వీఁడె
ముత్తెమువలె నున్నాఁడు ముద్దులాఁడు.

### చరణములు

చక్కనియశోద దన్ను సలిగతో మొత్తరాఁగా
మొక్కఁబోయీఁ గాళ్లకు ముద్దులాఁడు
వెక్కసాన రేపల్లె వెన్నలెల్లా మాపుదాఁకా
ముక్కున వయ్యంగఁదిన్న ముద్దులాఁడు.
రువ్వెడితాళ్లఁదల్లిరోలఁ దన్నుఁ గట్టినంటా
మువ్వలగంటలతోడి ముద్దులాఁడు
నవ్వెడిఁ జెక్కులనిండా నమ్మికబాలునివలె
మువ్వురలో నెక్కుడైన ముద్దులాఁడు.
వేలసంఖ్యలసతుల వెంటఁ బెట్టుకొని రాఁగా
మూలఁ జన్ను గుడిచీ నీముద్దులాఁడు
మేలిమి వెంకటగిరిమీఁద నున్నాఁడిదె వచ్చె
మూలభూతి దానైన ముద్దులాఁడు. ॥ ౧౪౪ ॥

## దేసాళం

### పల్లవి

ఇంతిరో నీకోప మిం తేటికే
చింతవాయఁ గరుణఁ జూచీ గాని నిన్నును.

### చరణములు

చిత్తమేమి రాయో చెలియ నిన్నతఁడేమి
కొత్తగాఁబాలించె నో కూరిమి లేదో
వత్తునని రాకుంటె వచ్చీగా కిందేమి
తత్తరానఁ గన్నీటఁ దడిపేవు పయ్యెద.

అలుకేమి బరవో యతఁ డేమి యరవో
కలికిచేఁతలు నీకుఁ గరవో
సొలసి నీకడకంటఁ జూచినఁ నాతనిగుండె
తలఁక కెట్టుండె నీతలఁ కేలె నీకూ.

పువ్వుల వేసినంతనే పొక్కెనట నీమేను
నవ్వు లెంత జూపు నీకు నమ్మికగాదా!
యివ్వల నప్పుడే వేంకటేశుం డిదె నిన్నుఁ గూడె
దవ్వులే చేరువ లాయె దక్కెఁగా నీపనులు. ॥ ౧౪౫ ॥

## దేశాక్షి, యెకతాళి

### పల్లవి

పరతత్త్వం బగు బాలుఁడు
పరిపరివిధముల బాలుఁడు.

### చరణములు

చద్దులమూటలు చంకల వ్రేలెడి
ముద్దులపడుచుల మూఁకలతో

పెద్దటికెంబునఁ బేయలఁ గాచిన
బద్దులనటనల బాలుండూ.
వెన్నలుదాఁకఁగ వేట్లాడుచును
సన్న పుఁబడుచుల సంగడిని
కన్నెలు దూరఁగఁ గలకల నవ్విన
పన్నిన మాయల బాలుండు.
బచ్చనరూపుల పాయపుఁబడుచులు
నిచ్చలుఁ గొలువఁగ నెమ్మదిని
నచ్చిన వేంకట నగమున నాడెడి
పచ్చిలపదకపు బాలుండు. ॥ ౧౪౬ ॥

## శ్రీరాగం

### పల్లవి

అప్పళించినజవ్వాది యంటినమేనులతోడ
తొప్పం దోఁగు చెమటల దొరుగు టెన్నండురా.

### చరణములు

చెక్కువట్టి కదలించి చిఱునవ్వుతోడి నోరు
నొక్కి కౌఁగిలించి నోరునోరు గదియించి
అక్కలివొయ్యనిమాట లాడి పేరుకొని తిద్ది
మక్కువదలంచి మేను మఱచు టెన్నండురా!
ఉరముపై చనుగుబ్బ లూఁది పులకలు నించి
సరిలేనియధరము సారెసారెయు నాని
సిరిగలకొనగోరు సిరసుపై నొత్తియొత్తి
సురవైభవములఁ జొక్కు టెన్నండురా.
చాలియుం జాలనియట్టి సౌఖ్యసంపదలచే
తేలగిలెడికన్నుల తెలివాలుఁ జూపుల
యీలాగు తిరువేంకటేశుండు మనకు నబ్బి
నీలోపల నేఁగలసి నీవౌట యెన్నండురా! ॥ ౧౪౭ ॥

రేకు-౩౭ భూపాలం

## పల్లవి

తొయ్యలిభారపుఁదురుమమరె
ముయ్యకమూసిన మురిపమున

## చరణములు

చందనగంధికిఁ జనుగుబ్బలపైఁ
జందెపు ముత్తెపు సరు లమరె
చెందిన వేడుక చెలి నుపనయనము
జందెము వేసిన చందమున;
అంచగమనకును అలపుల నడపుల
ముంచినమట్టెలమ్రోఁ తమరె
పంచమవేదము పంచసాయకుఁడు
చంచునఁ జాఁటినచందమున.
బొట్టుగఁ గుంకుమ పొలఁతినుదుటిపై
గుట్టుగఁ బెట్టిన గుఱు తమరె
రట్టడి వేంకటరమణునికౌఁగిటఁ
బట్టము గట్టిన భావమును. ॥ ౧౪౮ ॥

శ్రీరాగం

## పల్లవి

ఉదయాద్రి తెలు పాయె నుడురాజు కొలువిడె
అద నెఱిఁగి రాఁడాయె నమ్మ నావిభుఁడు

## చరణములు

చన్నులపై ముత్యాలసరు లెల్లఁ జల్లనాయె
కన్నులకుఁ గప్పాదవెఁ గాంత నాకిపుడు
కన్నెకలువలజాతి కనుమోడ్చినది మీఁద
వెన్నెల వేసంగిమొగ్గ వికసించె గదవె.

పువ్వుల లోపలికురులు బుగులుకొనఁగా నెఱసె
దవ్వులఁ దుమ్మెదగములు తరమి డాయఁగను
రవ్వసేయుశుకపికము రాయడి కోర్వఁగరాదు
అవ్వల నెవ్వతెపసల కలరున్న వాఁడో.
పన్నీట జలక మార్చి పచ్చకప్రము మెత్తి
చెన్నుగం గొప్పున విరులు చెరువం దురిమి
యెన్నంగల తిరువేంకటేశుం డిదె ననుం గూడె
కన్నులు మనసునుం దనియం గరుణించెం గదవే ॥ ౧౪౯ ॥

## శుద్ధవసంతం

### పల్లవి

తాపంబుం గోపంబు తమకుందామే వేఁగు
పైపైనే వగపులోపలి కెల్లా వేఁగు.

### చరణములు

చెలియ దురిమినతురుము శిరసునకుఁ గడువేఁగు
తలపోత శిరసు కరతలమునకు వేఁగు
కొలఁది మీఱిన యూర్పు కుచయుగములకు వేఁగు
బలువు కుచములు నాభిపయి కల్లవేఁగు.
మురిపంపునడపు చెలిమొలనూలికిని వేఁగు
బిరుసైన మొలనూలు పిరుఁదునకు వేఁగు
అరిది జఘనము మందయానంబునకు వేఁగు
తరుణిగమనము పాదతలమునకు వేఁగు.
మృగనేత్రిప్రాణంబు మేని కింతకు వేఁగు
బుగులుకొను మైకాఁక పులకలకు వేఁగు
తగువేంకటేశుకృప ధైర్యంబునకు వేఁగు
అగపడిన యీపొందు అలుకలకు వేఁగు. ॥ ౧౫౦ ॥

## కన్నడగౌళ

### పల్లవి

చక్కని సరసపు శిశువు
పెక్కుమాయల పెనుశిశువు

### చరణములు

చిమ్మెడి విషములు చేఁపినరొమ్ములు
కొమ్మని యిచ్చినఁ గుడిచేని
బొమ్మరపోవఁడు పూతకిఁ బొరిగొని
అమ్మరో గయ్యాళి శిశువు.
చుట్టమువలెనే సుడిగాలినిఁ గని
బెట్టుగఁ గౌఁగిట బిగించేని
పుట్టఁడు వొడమఁడు బూమెలే చేసీ
పట్టరే పసి బాల శిశువు.
పాదము చాఁ చటు బండి జాతురకు
ఆదిగొనుచు తా నలరీని
వేదవేద్యుఁ డగు వేంకటగిరిపై
మోద మందిన మున్నిటిశిశువు. ॥ ౧౫౧ ॥

## ముఖారి

### పల్లవి

ఇంతి చేసినపూజ లిట్లుండెఁ దనహృదయ
మంతయును బూజించె నడియాసచేత

### చరణములు

చనుదోయి పూజించె జాజుఁబులకలచేత
కనుదోయి పూజించెఁ గన్నీటిచేత

మనసు పూజించెఁ బ్రేమపుఁగోరికలచేత
తనువు పూజించెఁ బరితాపంబుచేత.
తలపు పూజించెఁ చింతాపరంపరచేత
అలపు పూజించె నొయ్యనిపలుకుచేత
వలపు పూజించెఁ బొలయలుకచేతను నెంతే
సొలపు పూజించెఁ దనచూపరలచేత.
అనఘుఁ డీతిరువేంకటాద్రీశు కృపచేత
వనిత సంభోగపరవశముఁ బూజించె
తనివోని గుఱుతుచే తనవిలాసములచే
గనుపట్టఁ బూజించె గళమర్మములను. ॥ ౧౫౨ ॥

## భూపాళం

### పల్లవి

లేని భ్రమ లుడిగి లేవయ్యా,
లేనగుమోముతో లేవయ్యా.

### చరణములు

చెంచెత కౌఁగిటఁ జెలఁగి వేడుకఁ బవ
ళించిననాథుండ లేవయ్యా
పించెపుం బయ్యెదఁ బెనగి రతినిఁ జా
లించి యింతటను లేవయ్యా.
చక్కని శ్రీసతి చనుఁగవ నన్నపు
లెక్కలు వ్రాయక లేవయ్యా
పెక్కగు నమృతము పెదవికోమలిక
లిక్కగఁ జేసితి లేవయ్యా.
ఏకాంతలో ని న్నెనసి తలఁచి రని

లేకలు వచ్చెను లేవయ్యా
శ్రీకాంతుఁడవగు శ్రీవేంకటనా
థీకదళాక్షుఁడ లేవయ్యా. ॥ ౧౫౩ ॥

రేకు-౩౮ పాడి

పల్లవి

ఇంతేపో వల పిందరికి
దొంతిత్తల వింతల్ల రంతులును.

చరణములు

చిత్తపు టీతఁలు చిడిముడి సేఁతలు
పొత్తుల తమ తల పోఁతలును
మెత్తని యధరపు మేఁతలు లోలో
కుత్తికెఁ గులికెడి కూఁతలును.
చూపులతీపుల్లు సొక్కుల పులకలు
దాపుల తమతమ తమకములు
కోపపు కిసరులు కూటపు కొసరులు
ఏపున విరహపు టెసరులును.
పువ్వుల వాట్లు పున్నమ చాట్లు
నవ్వుల హృదయపు నాట్లును
రవ్వగు వేంకటరమణునిఁ గలసిన
యివ్వల మరువం పేట్లును. ॥ ౧౫౪॥

కన్నడగౌళ

పల్లవి

మనసు తనపాలింటి మమకారభూతమై
అనయంబు నిన్నిటికి నాధార మాయ.

### చరణములు

చూపు లాసలఁ దగిలి సుఖయించఁ బోయినను
పైపైనె తలఁపులో పరితాప మాయ
తాపంబుం బరవశము తనువు సొగసిన మఱియు
నాపదల కన్నిటికి నది మూల మాయ.
తలఁపులోపలిరతులఁ దమకించఁ బోయినను
తలఁపు వలపుల కెల్లఁ దగులాట మాయ
వలపు లనియెడి మహావైభవము వొడగనిన
నలపులును సొలపులును నతిఘనము లాయ.
కడు సొలసి శేషాద్రిఘనుని దూరినయంత
అడరి యాతనికోప మగ్గలం బాయ
కడలేని కోపంబు కరుణారసముతోఁ
దడిసి యీపొందులకుఁ దరవుకాఁ డాయ. ॥ ౧౫౫ ॥

### కాంబోది

### పల్లవి

ఏలరాఁడే చెలి నన్ను నెలయించి పచ్చవన్నె
చేలగట్టి పీలిచుంగు చెరిగినవాఁడు

### చరణములు

చీకటిమేనివాఁడు చెలువై నమణులకు
వేకట్టైనతరుణికి కూఁకటతో మగండు
రోఁకటి కైదువవాఁడు రోలఁ గట్టువడ్డవాఁడు
ఆఁకటికి పాలువెన్న లారగించేవాఁడు.
పంకజములోనియింతిం జంకంబెట్టి యంతఁబోక
అంకులచేతులవారి కాసచేసేవాఁడు

బింకపు రాకాసుల పేరుమాల్చినవాఁడు
వంకల వంకల మేన వన్నె వెట్టువాఁడు.
పాలవారియింటి పిన్న పాపఁడై తిరిగినాఁడు
గాలి దాగువానిమీఁదఁ గాలు సాఁచినాఁడు
పాలమీఁది కొండమీఁదఁ బల్లెగట్టిలోక మెల్ల
నేలుచున్నవాఁడు వేంకటేశుఁ డమ్మ యితడు. ॥ ౧౫౬ ॥

## రీతిగౌళ

### పల్లవి

నాలం వా తవ నయవచనం
చేలం త్యజ తే చేటీ భవామి.

### చరణములు

చల చల మమ సంసద్ఘటనే కిం
కులిశహృదయ బహుగుణవిభవ
పులకిత తనుసంభృత వేదనయా
మలినం వహామి మదం త్యజామి.
భజ భజ తే ప్రియాభామాం సతతం
సుజన స్త్వం నిజసుఖనిలయ
భుజ రేఖా రతి భోగిభవసికిం
విజయీభవ మద్విధిం వదామి.
నయ నయ మా మనునయనవిధం తే
ప్రియకాంతాయాం ప్రేమభవమ్
భయహర వేంకటపతే త్వం మ
యో భవసి శోభితా భవామి. ॥ ౧౫౭ ॥

## శ్రీరాగం

### పల్లవి

పువ్వులవలన నార పొదలి తలకెక్కిన,
ట్లెవ్వరును నినుఁ గూడి యేపు మిగులుదురు

### చరణములు

చెలియకీ పెనుఁదురుము చీకటే వెలుఁగాయ
కలికి కనుఁగొనల తొలుకరి మెఱుపులా
వలనైన తెల్లగల వారి సంగడి నున్న
మలిన దేహులు కాంతి మహిమఁ జెందుదురు.
లేమకీనెన్నడిమి లేమే కలి మాయ
మోమునకు నెగురు కుచముల బరువున
కామించి పేదలును గలవారికడ నున్న
వేమారు సంపదల విఱ్ఱవీఁగుదురు.
జలజాక్షి చిత్తచంచలమే తిర మాయ
కెలసి నిన్నిట్ల కౌఁగిటఁ గలయఁగా
వెలుఁగొందు నిశ్చలులు వెంకటేశ్వరుఁడ నీ
చెలిమి వెడమమతులైన సిరులఁ జెందుదురు. ॥ ౧౫౮ ॥

## సామంతం

### పల్లవి

వలపువో కారణము వైభవంబులకుఁ దమ
తలఁపువో సకలంబుఁ దగులు సేసినది.

### చరణములు

చూపువో ప్రియములకుఁ జోటునేసినది తరి
తీపువో వెడయాస దీరనీయనిది

రూపువో సౌఖ్యంబు రుచిసేసినది పున్నుఁ
దూపువో హృదయంబు దూరిపాటిసె...
ఒఱపువో పెడఁబాసి పు ఁనియ్యనిది తమ
వెఱపువో దేహంబు వెచ్చఁజేసినది
మఱపువో ధైర్యంబు మానిపించినది కను
గిఱుపువో సిగ్గెల్లఁ గ్రిందుపఱిచినది.
చెలిమివో కారణము శ్రీవేంకటేశుకృప
కలిమివో మచ్చికలు కలుగఁజేసినది
ఎలమివో యీపొందు లితవు సేసినది మరు
బలిమివో కోరికలఁ బట్టి తెచ్చినది. ॥౧౫౯॥

తేకు-౩౯ కన్నడగౌళ

పల్లవి

కుసుమకోమలి విభునిఁ గొనియాడునెయ్యంపు
వసివాడు మోము నవ్వక నవ్వినట్లు.

చరణములు

చెలియ గుబ్బలమీఁది జిలుఁగుఁ బయ్యెద మెఱుఁగు
చలివెలుఁగు నవల దాఁచక దాఁచినట్లు
పొలఁతి మొలనూలి మొగపులదీప్తి సంసార
ఫల మెక్క డనుచు చూపక చూపినట్లు.
తరుణి కనుఁగొనల బిత్తరిచూపు విభుమీఁది
పరవశం బెల్లఁ జెప్పక చెప్పినట్లు
గరితప్రేఁకపుఁగొప్పు గడలు లావణ్యంబు
సరసత్వ మెల్లఁ బెంచక పెంచినట్లు.
ఇంతి శ్రీతిరువేంకటేశుఁ బొందినరతి
శ్రాంతి సౌఖ్యములు దలఁచక తలఁచినట్లు

కాంత లోఁ గొన్న మరుగతులు చెలులకుఁ దెలుపు
మంతనపు బాస పాడమక పాడిమినట్లు. ॥ ౧౬౦ ॥

## హిందోళవసంతం

### పల్లవి

లలితాంగి యౌవనము లావణ్యములప్రోవు
అలరి యిటువలెఁ జేసెనమ్మా

### చరణములు

జవ్వాది మిగుల నుష్ణముమీఁద సంపంగి
పువ్వు గట్టినది గన పొదలెఁ దాపంబు
నివ్వటిలు గొజ్జంగి నీట నొయ్యన కడిగి
దువ్వటపుఁ బయ్యెదను దుడువరమ్మా!
మృగమదము గడు వేఁడి మెలుఁతతలపట్టునకు
అగలు గూడఁగ వేద నగ్గలంబాయ
బిగువైన కస్తూరి బేం ట్లొయ్యనగోర
నగలించి తట్టుపునుఁ గంటరమ్మా.
విరహతాపంబునకు వేరొండు గతిలేదు
పొరసి వేగించినాఁ బోదు
తిరువేంకటాచలాధిపుని మన్ననఁ గాని
అరిదిమోహము దీరదమ్మా! ॥ ౧౬౧ ॥

## పాడి

### పల్లవి

సదయ మానససరోజాత మాదృశ వశం
వద ముదాహం త్వయా వంచనీయా కిమ్

## చరణములు

జలధికన్యా పాంగ చారు విద్యుల్లతా
వలయ వాగురి కాంత వనకురంగ
లలితభవ దీక్షా విలాస మనసిజబాణ
కులిశపాతై రహం క్షోభణీయా కిమ్.

ధరణీవధూ పయోధర కనకమేదినీ
ధరశిఖర కేళితత్పర మయూర
పరమ భవదీయ శోభనవదనచంద్రాంశు
తరణికిరణై రహం తాపనీయా కిమ్.

చతురవేంకటనాధ సంభావయసి సం
ప్రతి యధా తత్ప్రకారం విహాయ
అతిచిర మనాగత్య హంత సంతాపకర
కితవకృత్యై రహం ఖేదనీయా కిమ్. ॥ ౧౬౨ ॥

## జౌళి

## పల్లవి

ఒడలి తాపముమీఁద నుసురనీని
కడలేని చిచ్చుమీఁద గాలి చల్లీఁ దరుణి

## చరణములు

జల్లనం గొప్పువిరులు జారఁ దోచి జవరాలు
మెల్లనే తుమ్మిదలకు మేఁత వెట్టీని
చెల్లఁబో మీఁ దెఱుంగదు జెప్పరమ్మ పెనుఁబాము
పిల్లలకుఁ బాలువోసి పెంచఁజూచీఁ దరుణి.

గొప్పవైన గుబ్బలపైఁ గుంకుమఁకస్తూరిపూఁత
లప్పలు గాలికిఁ దెచ్చి లంచ మిచ్చీని

ఒప్పదు మానుపరమ్మా ఉప్పతిలఁ బలుమారు
నిప్పులమీఁదటఁ దెచ్చి నేయి చల్లీఁ దరుణి.
చెనకించి యధరంపుఁ జిగురాకు కెంపుల
నొనరుఁ గోవిల నోరూరించీని
చనవున వేంకటస్వామి కౌఁగిటఁ గూడి
కినిసి పొసెములూఁ జక్కెర వెట్టెఁ దరుణి. ॥ ౧౬౩ ॥

## ఆహిరి - అటతాళం

## పల్లవి

చూచియుం జూడవు సుదతివంక
నీచేఁత లిన్నియు నీకె చెల్లును

## చరణములు

జిగి మించు నుంగరాల చెక్కుమీఁది చేయి
చిగురు చెంద్రికగోళ్ల జెలువొందంగా
పగటుఁ గోపముతోడ భారపు టూర్పులతోడ
నిగి డున్న చెలిలాగు నీకే తెలుసును.
పొడవుగుబ్బలిమీఁది పులిపట్టు చెఱంగు
జడిసి హారపుఁగాంతి ఝళిపించఁగా
వడ చల్లుమేనితో వసివాఁడు జూపుల
నిడువాలుఁ గనుసొంపు నీకే తెలుసును.
భారపుం దురుముమీఁద పసమించు నెఱులు
జీరువారి విరులతోఁ జెంగలించఁగా
చేరువనే కూడితివి శ్రీవేంకటేశుండ
నీరజవదనలాగు నీకే తెలుసును. ॥ ౧౬౪ ॥

## సావేరి

### పల్లవి

ఊరకే పోనియ్యరా నన్నుద్దండాన
చేర లంతేసికన్నులఁ జెంగలించే విప్పుడు

### చరణములు

జూద మాడఁ బిలిచేవు చూపులనే జంకించేవు
పేదవారిమేన సొమ్ము పెట్టనియ్యవా
కేదమున నోడి గెలిచితినంటా నా
పాద మంటి తీసుకోరా బంగారుమట్టెలు.
నెత్తమాడఁ బిలిచేవు నెఱవాది నంటాను
అత్తమామ గలవార మదేమి రా!
ఒత్తి విన్నవించలేము ఓడితేను నీకు నాకు
రిత్తమాట వద్దు రేఖరేఖ పందెమా!
సొక్కటాలు నిన్న నాడి సోలి సత్యభామకు
మ్రొక్కితివి నేఁడు నాకు మ్రొక్కవలెఁగా
చక్కని వేంకటపతిస్వామి నన్నుం గూడితివి
మొక్కెద కర్పూర తాంబూల మీరా చాలును. ॥ ౧౬౫॥

రేకు -౪౦ దేశాక్షి

### పల్లవి

అటువంటివైభవము లమరఁజేసినదైవ
మిటువంటియోగంబు లిన్నియును జేసి.

### చరణములు

జలజాక్షి లావణ్యజలధి నుప్పొంగింప
నలివేణి ముఖచంద్రుఁ డభ్యుదయమాయ

కలికి వలరాయఁడను కాలకూటంబుతో
దలకొన్న యధరామృతంబు జన్మించె.
వనిత సౌభాగ్యంబువనధిలోపలఁ దోఁచె
గొనకొన్న గుఱుతైన కుచపర్వతములు
తనివోనికోరికల తగుతురంగములతో
ననువైన విరహబడబానలము గలిగె.
భామ యవ్వనమనెడి పాలజలనిధిలోన
వామాక్షియైన యవ్వనలక్ష్మి గలిగె.
యీమంచి తిరువేంకటేశ్వరుం డిందులోఁ
బ్రేమమున సుఖియించి పెంపొందఁగలిగె. ॥ ౧౬౬ ॥

## ఆహిరి

### పల్లవి

ఏఁపుచు నాకా ళ్లితఁడేల పట్టేనె
రాఁపు సేసి నాకుఁ బెద్దమోఁపు గట్టినట్లు.

### చరణములు

తలమాసి కోకమాసి తాపమున నుండంగాను
యెలయించి యితఁడు నన్నేల యేఁచీనే
మలినమై దేహమెల్ల మఱిచినఁ దలఁపించి
వులికి కాలఁగఁ గొఱవులఁజూఁడినట్లు.
కూడుఁబాసి నీటిఁబాసి కొరమాలి వుండఁగాను
యేడనుండో వచ్చి యీతఁ డేల పోరీనే
వేడుక లన్నియు మాని వేదనల నుండఁగాను
కాఁడినపోట్లలోన కత్తిఁగోసినట్లు.
తల్లిఁబాసి యిల్లువాసి తరిలేక వుండఁగాను

యెల్లగా కౌఁగిట నితఁ డేల నొక్కీనే
చెల్లునంటా నన్ను గూడి శ్రీవేంకటేశుండు
ముల్లు ముంటనే తీసి మోసపుచ్చినట్లు. ॥ ౧౬౭ ॥

ఆహిరి

పల్లవి

నేరుపులమాట గాదు నీయాన
కూరమి నీచే జట్టిగొనక నిన్నొల్లను

చరణములు

తట్టుపునుంగుల తలచెంచెతను నన్ను
పట్టకురా నీకు నీపాదమాన
గట్టిగఁ దామరలోని కాంత మానితినని
గుట్టుదీర నానవెట్టుకొనక నిన్నొల్లను.
పయ్యెద పాఱుటాకుల భారంపుగుబ్బల నన్ను
తియ్యకురా నీకు నీదేవరాన
వ్రయ్యములు తొమ్మిదైన వనిత మానితినని
కొయ్యతనమున బాసగొనక నిన్నొల్లను.
నలఁగు జవ్వాదిమేని నన్నుఁ గడుంగౌగిట
నలమకు నీకు నీయమ్మాన
ఎలయించి తిరువేంకటేశ కూడితి నన్ను
కెలన నీవెటు దొలంగినను నిన్నొల్లను. ॥ ౧౬౮ ॥

ఆహిరి

పల్లవి

రమణుని చేఁతలు దక్కెను రావులు రంతుకు నెక్కెను
మమతలు లోలోఁ జొక్కెను మాటలు మఱియేలే

### చరణములు

తలపోఁతలు తనుఁ గూడెను తాలిమి గంటును వీడెను
కలువలు ఇరుమైఁ గాఁడెను కటకట యిఁక నేమే
బులుపులు సిగ్గుల కోడెను పులకలు సమతలు గూడెను
చలములకును విధి మూడెను జవ్వన మిది యేలే!
మచ్చికమానము రేఁగెను మచ్చరములె మతి మూఁగెను
చిచ్చును గాలియుఁ గూడెను చీచీ యిఁక నేమే!
ముచ్చట రతి కెదురేఁగెను మురిపము వెనుకకు వీఁగెను
వెచ్చి వివేకము, రాఁగెను వేడుక లిఁక నేలే.
భారపు చెమటలు జాఱెను పై చెమటలు దైవాఱెను
కూరిమి కడుఁ దుద మీఱెను కొంకెడి దిఁక నేలే
వీరిఁడి వెఱపును జాఱెను వేంకటపతి కృపచేరెను
గారవములు కడుఁబేరెను కసరెడి దిఁక నేలె. ॥ ౧౬౯॥

### శ్రీరాగం

### పల్లవి

రాకురాకు మయ్యా మాతో రంతు లింతేలా
వాకు నిష్ఠూరాన నిన్ను వద్దన నేఁ జాలను.

### చరణములు

తొలవయ్య కాలుదాఁకీ దోసాలు గట్టకా
తొలుతేమి చేసితినో తొయ్యలినైతి
చెలఁగి యిందఱూ నీకుఁ జేయెత్తి మ్రొక్కఁగా
చిలుకు గోళ్ల నిన్నుఁ జెనక నేఁ జాలను.
ఏమిటికి నంటించేవు ఎంగిలి మామోవి
బూమిలేని చదువుల పుట్ట నీనోరు

వేమాఱు నిందలు నీకు వినుతించి మ్రొక్కఁగ
ప్రేమపునోర నిన్ను పేరఁ దిట్టఁజాలను.
యేల కిందుపడి మొక్కే వేమి బాఁతినే నీకు
కూళ నింతేని కాలిగోరఁ బోలను
మేలిమి శ్రీవేంకటేశ మెఱసి మాచనవు
మేలములాడుచు నిన్ను మెప్పించ నేఁ జాలను. ॥ ౧౭౦ ॥

## ఆహిరి

### పల్లవి

కరేణ కిం మాం గృహీతుం తే
హరే ఫణిశయ్యా సంభోగ

### చరణములు

జలే తవ సంచరణ మిహాధస్
స్థలే భవనం తవ సంతతం
బలే రూప ప్రకటన మతులా
చలే స్థానం చల చల రమణా.
పదే భువన ప్రామాణ్యం తవ
హ్రదే ప్రచురవిహరణ మిదం
ముదేమునీనాం మోహనం తనుం
మదే తవ నర్మ చ మాం విసృజ.
స్మరే విజయ స్తవ విమలతురగ
ఖరే రతిసంకుల రచన
పురే తవ విస్ఫురణం వేంకట
గిరేఃపతే తే ఖేలాఘటిత. ॥ ౧౭౧ ॥

రేకు-౪౧ సామంతం

పల్లవి

దిమ్మరి గాకేల మాను ధీరుఁడైన కోనేటి
తిమ్మఁడు దా లోకమెల్లఁ దిరుగాడువాఁడు.

చరణములు

తోరమైన ముత్యాల తొళసిపూసల పెద్ద
పేరు దనవురముపైఁ బెట్టినవాఁడు
గారవంపుఁబచ్చఁబట్టు గట్టినవాడు వొ
య్యారపు గొల్లెతలఁ గూడాడినట్టివాఁడు.

పీలిచుట్టుఁదలవాఁడు పెదపెదకన్నుల
వాలుఁజూపుల సిరికి వలచువాఁడు
జాలిబెట్టి లోకమెల్ల జట్టిగొన్నవాఁడు తా
నేలనుండి మింటఁబాఱ గాలు చాఁచువాఁడు.

కొండ మోఁచినట్టి వాఁడు కొండ వేల నెత్తువాఁడు
కొండంత రాకాసులఁ గొట్టినవాఁడు
కొండవంటిదొరయైన కొండలకోనేటివాఁడు
కొండమోఁపరుల నెల్లఁ గూడపెట్టినాఁడు. ॥ ౧౭౨ ॥

కన్నడగౌళ

పల్లవి

మఱపైన నొకకొంత మాటుగాదా
తెఱవ నూరక యేల తెలిపేరు సతులూ.

చరణములు

తరుణిని విరహసంతాపంబు దావాగ్ని
ధరియించ చెమ్మటెన దండ గాదా

మరుని కార్ముకబాణమహిమ గడు నెఱ(గించె
దురదురన( జేతులనె తుడిచేరు సతులు.
పొ(లితి కిపుడొకయింత పొద్దువోకలు సేయ
తలపో(తయైన దరిదాపు గాదా
వెలలేని సోయగపువిభుని చల్లనిరూపు
పెలచమాటలనే మరపించేరు సతులు.
అలివేణి మేని విరహాగ్ని లొయ్యన పూడ
నలరునిట్టూర్పైన యాసగాదా
వలపెరి(గి వేంకటేశ్వరు(డు గరుణించె నిదె
కలువపూవులబంతి గట్టేరు సతులు. ॥ ౧౭౩ ॥

## కేదారగౌళ

### పల్లవి

ఏమి చెలియా యేలాగే
వేమారును వెల్లి విరిసీ( బ్రేమా.

### చరణములు

తోడితేదొకో తొయ్యలివాని(
దోడితేదొకో తొయ్యలి
వాడీ( జిత్తమిదె వనితరొ మై
గా(డి మదనుని కమ్మవిరులు.
తానే రా(డొకో దైవమా వా(డు
తానే రా(డొకో దైవమా
నేనోప నిలువంగ నింకను
నానేరుపుల నానదు నామనసూ.
వీ(డే( గదవే వేంకటేశు(డూ వీ(డే
వీ(డె( గదవే వేంకటేశు(డూ

నాఁడే నమ్మించే నన్నును
నేఁడే కౌఁగిట నెలకొనె నాకు. ॥ ౧౭౪ ॥

## భూపాలం

### పల్లవి

పొలయలుక నిద్దరలు భోగించ దొరకొంటి
అలర వడి మేల్కొనవె అఖిలేశ్వర.

### చరణములు

తరుణిమైనపుడె పరితాపసూర్యుఁడు వొడిచె
వరుసఁ జెలి కన్నుఁగలువలు మొగిచెను
మరుని సాయకపు తామరలు వికసించె
కరుణతో మేల్కొనవె కమలేశ్వర.
కాంత నిట్టూర్పులను గాలియును నగ్నియును
వంత చెమటలవాన వరుణుండును
వింతలుగ నిన్ను సేవింతుమని యున్నారు
పంతమున మేల్కొనవె పరమేశ్వర.
మెలుఁత పెనుఁదురుమనెడి మేఘమండలములో
నలుగడలఁ జెలఁగె సుమనసపంక్తులు
కులికి పూవులవాన గురియంగ నున్న దిదే
చలముడిగి మేల్కొనవె సర్వేశ్వర.
కదిసి పులకలసృష్టి కడలేక పొడమించు
మదనుఁడను మానసకమలభవుఁడును
ముదిత కోపపుహరుఁడు మొనసి యున్నారిదే
నిదుర మేల్కొనవె జలనిధిశయనుఁడ.
ఒడికముగఁ జెలిలోన నుదయరాగము వొడమె
వెడలె నదె పలుకుఁ గోవిలరవములు

పడఁతిఁ గూడితివి రవిపరవశం బిఁకనైన
కడఁగి మేల్కనవె వేంకటరమణుఁడ. ॥ ౧౭౫ ॥

## ఆహిరి

### పల్లవి

వోవలఁబుచ్చే వూరకిటు
నీవలె పొలయఁగ నేరర నేను

### చరణములు

తీపులఁ బొదిగిన తేనెల యలుగుల
చూపు చల్లకువే సుదతి
ఏపున నీకిపు డెదురులు చూచిన
చూపుల నేమిటిఁ జూతుర నేను.

చంచలబరచి చక్కనివదనము
వంచి నవ్వకువే వనిత
నించిన కాన్కల నినుఁ గని వదనము
వంచి నవ్వ నిట్టు వలదా నేను.

తాలిమి హృదయము తల్లడ మంది
కాలు దొక్కకువే కలికి
జాలి వేంకటేశ్వర కౌఁగిట నిను
కాలు దాఁకె నేఁకటఁ బడ నేను. ॥ ౧౭౬॥

## ముఖారి

### పల్లవి

బయలీఁదించకురే పలుమారు యీ
ప్రియునిపేర నిందరినిఁ బిలిచీఁ జెలియా.

## చరణములు

తడవి తవ్వకురే తమకపుఁజెలమ
వుడుకుచు నువ్విళ్లూరీని
పుడికి పెంచకురే పులకల నారూ
వొడలి బడలికల నొరగీఁ జెలియా.
దరికొలుపకురే తలపోఁతదాలి
కరసాన కాఁకలఁ గనలీని.
పురికొలుపకురే పుక్కిటి వూరుపూలూ
శిరసు నొప్పుల చేతఁ జిమిడీఁ జెలియా.
మంతన మాడకురే మతిలోని యలపులు
వంతలనే వదనము వంచీని
చెంతల విసరరె శ్రీవేంకటపతి
సంతపు లేఁజెమటల జడిసీఁ జెలియా. ॥ ౧౭౭ ॥

రేకు-౩౧ శ్రీరాగము

### పల్లవి

ఎటువంటి మోహంబు యెటువంటి పరిణతలొ
అటువంటి సతి పొందు లవి నీకె తగురా.

## చరణములు

చక్కని జవరా లొకతె జారెడికొ ప్పొకచేతఁ
జెక్కుచు సన్నపునవ్వు చిలికి చిలికి
చెక్కునఁ జెదరిన కమ్మం జెమటల తావులను
చొక్కుచు నిన్నరగంటం జూచె నెవ్వతెరా.
గద్దరికన్నుల కలికి కమ్మనిచల్లగాలి
అద్దినదేహముతోడ నలసి యలసి
ముద్దుల రెప్పలు దెరచి ముందటి నీ తనవలపు

సుద్దులు దెలుపుచు నిన్నుం జూచె నెవ్వతెరా.
కొండల రాయండ నీకొమరైన చెలిచన్నుఁ
గొండల నీ కెంగేలం గులికి గులికి
నిండిన కౌఁగిటిలోన నీవుం దానుం గలశుండి
వుండినటువలెం గూడి వుండె నెవ్వతెరా. ॥ ౧౭౮ ॥

**ఆహిరి**

**పల్లవి**

పాయరాని పదివేలు పనులు నీకు యీ
కాయము నీ విప్పుడైన కౌఁగిలించుమీ.

**చరణములు**

చిత్తజుతాపముచేత చిక్కవడ్డ దానం గాన
వొత్తి నీతో విన్నవించ నోపం గాని
యెత్తిన నీవిరహాన యే మౌదునో నన్ను
చిత్తగించి యెప్పుడైనాఁ జేరంగరమ్మీ.
తరి నిన్నుం బాసి మాట తడఁబడే దానం గాన
నెరి నిన్నుం దూరనాడ నేరం గాని
యెరగొని తలచీర యెరంగకున్నప్పుడైన
కరఁగి మఱవక నాకడ చూడుమీ.
దవ్వుల నిందాఁక నీకు తమకించే దానం గాన
జవ్వన మంటకు మనం జాలం గాని
రవ్వైన వేంకటరమణ నావద్ద నిట్టే
పవ్వళించి నేఁడైనాఁ బాయకుండుమీ. ॥ ౧౭౯ ॥

## భైరవి

### పల్లవి

ఏటిపొందు యేఁటిగుణము యేటి సవరందనము మనసు
నాఁటుకొలుపం జేయలేని నటన లేఁటికే.

### చరణములు

చూపు చూపు తారుకాణ చూపులోని నగవులెల్ల
చూపి పులకరించలేని సొబగు లేఁటికే
యేఁపు రేఁగి కోరికలకు యెత్తు సేసి మీఁదమీఁద
తాప మందఁజేయలేని తనువు లేఁటికే.
కదిసినపుడే మేను మఱచి కౌఁగిలించినట్టి చేయి
వదలి కన్ను ముయ్యలేని వలపు లేఁటికే
తుదలనైన చెమటగముల తొప్పఁదోఁగి మోహరతుల
సదమదముగఁ దనుపలేని చనవు లేఁటికే.
దేహధారి యైనఫలము తెలిసి వేంకటాద్రివిభుని
మోహ మందఁజేయలేని మురిప మేఁటికే
ఊహ దలఁచి తమక మంది వొకరి కొకరు యిట్ల నేఁడు
సాహసించి కలయకున్న జన్మ మేఁటికే. ॥ ౧౮౦॥

## దేసాళం

### పల్లవి

ఎట్టు ధరించే నింకాను
పట్టుట బరువీ ప్రాయము నాకు

### చరణములు

చెప్పక వచ్చిన చిత్తములోపలి
నొప్పులనేమై నొగిలీని

యెప్పుడు దలఁచిన హృదయము ఝల్లని
కుప్పలుగా మైఁ గురిసీఁ జెమటా.
అంపలేక నన్నంపిన [illegible]ప్పటి
తెంపు దలఁచిపో దిగుల నేను
యింపునఁదా నిపు డెట్లున్నాఁడో
కంపించీ మది కటకట యిపుడూ.
తిరిగి చూచినను దేహము చిత్తముఁ
బరవశ మయ్యీఁ బలుమారు
తిరువేంకటగిరి దేవుఁడు కౌఁగిటఁ
గరుణించఁగఁ జీఁకటి వెడఁబాసె. ॥ ౧౮౧ ॥



# సూచికలు

## ౧

## సంకీర్తన రాగముల అకారాది సూచి.

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| ఆహిరి (25) | 1, 12, 14, 15, 18, 19, 20, 35, 62, 87, 97, 98, 101, 116, 119, 123, 135, 139, 162, 165, 166, 167, 169, 174, 177. |
| కన్నడగౌళ (6) | 45, 86, 149, 153, 158, 171. |
| కాంభోజి (7) | 4, 16, 94, 102, 131, 142, 154. |
| కేదారగౌళ (1) | 172. |
| కొండమలహరి (1) | 108 |
| గౌళ (1) | 43 |
| దేశాక్షి (4) | 41, 69, 144, 164 |
| దేసాళం (2) | 143, 179 |
| నాట (2) | 47, 91 |
| నాదనామక్రియ (3) | 31, 57, 111 |
| సాళంగనాట (1) | 74 |
| పాడి (9) | 51, 73, 76, 81, 99, 109, 132, 152, 160. |
| బౌళి (2) | 13, 161. |
| భూపాలం (7) | 25, 78, 83, 124, 146, 151, 173. |
| భైరవి (7) | 2, 30, 64, 80, 90, 129, 178. |

| | |
|---|---|
| ముఖారి (14) | 3, 24, 29, 34, 49, 50, 59, 84, 96, 117, 137, 140, 150, 175. |
| మెంచబౌళి (1) | 28. |
| రామక్రియ (5) | 37, 60, 85, 104, 115. |
| రీతిగౌళ (1) | 155. |
| లలిత (3) | 26, 39, 63. |
| వరాళి (3) | 70, 19, 138. |
| **శంకరాభరణం** (11) | 6, 7, 36, 56, 66, 93, 107, **112, 118** 130, 136. |
| **శుద్ధదేశి** (1) | 61. |
| **శుద్ధవసంతం** (3) | 22, 55, 148. |
| శ్రీరాగం (23) | 8, 9, 10, 32, 38, 48, 52, 54, 65, 72, 92, **113, 120**, 121, **126, 127**, 128, 141, **145, 147**, 156, **168**, 176. |
| **సామంతం** (29) | 5, 11, 17, 27, 33, 40, 42, 44, 46, 53, 58, 68, 71, 75, 77, 82, 88, 89, 95, 101, 103, 105, 106, 110, 114, 133, 134, 157, 170. |
| సావేరి (1) | 163. |
| సౌరాష్ట్రం (2) | 21, 23. |
| హిందోళ వసంతం (2) | 67, 159. |
| హిజ్జజి (1) | 122. |

అ

# సంకీర్తనల అకారాది సూచిక

